ఆంధ్రసాహిత్యపరిషత్ప్రచురణము—సంఖ్య—3౮.

నెల్లూరు వర్ధమాన సమాజము
నెల్లూరు

శ్రీరస్తు.

# సింహాసనద్వాత్రింశిక.

ప్రథమభాగము.

(క్రీ॥శ॥ 15 వ, శతాబ్దివాఁడగు)

## కొఱవి గోపరాజకవికృతము.



కాకినాడ:

ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచేఁ బ్రకటింపఁబడినది.

1936

కాకినాడముద్రాక్షరశాల, కాకినాడ.

శ్రీగురవేనమః.

# సింహాసనద్వాత్రింశిక పీఠిక.

---

సింహాసనద్వాత్రింశిక యనునీకావ్యము ద్వాత్రింశత్సాలభంజికలు భోజరాజునకుం జెప్పిన విక్రమార్కునికథలు. అయ్యవిముప్పదిరెండు. ఆకథలసముచ్చయమే యీకావ్యము. దీనికిమూలము కథాసరిత్సాగరము* ఆసాగరమునుండి యీరత్నమునెత్తి చక్కగా సానఁబట్టి యాంధ్రసరస్వతిని బూజమొనరించిన మహాకవి కొఱవి గోపరాజు. ఇట్టిమహారత్న మింతకాలముదాఁక నుమఱుఁగుపడి యుండుట యత్యద్భుత మనకతీఱను. కవికాలమునుబట్టి చూడఁ బురాణయుగమునకుఁ గడపటను బుట్టిన మొదటిప్రబంధ మయ్యును దీనినిఁ దరువాతఁ బ్రబంధకవు లెవ్వరును స్మరియింపకుండుట యేకారణముననో యూహింపఁజాలకున్నారము. ఇట్టికావ్యరత్నమును దిరుగ సముద్ధరించిన శ్రీయాంధ్రసాహిత్యపరిషత్తువారికి నాంధ్రదేశ మెంతయుఁ గృతజ్ఞమై యుండకతప్పదు. చిన్నచిన్నమాటలతోఁ దేనెలు గురియునట్లు, లేకాకారముగా నుండి విపుల మయ్యు విసువు పుట్టనట్లు తత్తదుచితస్థలములందే వర్ణనలతో నిండి పాండితీశక్తి యటుండఁ గవితాశక్తికే ప్రాధాన్య మీయఁబడిన యిట్టికావ్యము లాంధ్రమునం దరుదు. ఇట్టికథాసముచ్చయరూపము లగు కావ్యములు బేతాళపంచవింశతి, హంసవింశతి, శుకసప్తతి మున్నగునవి యున్నను నిట్లు సర్వావయవపరిపోషణము గాంచిన వన విలులేవు. కడపటి దగు శుకసప్తతి జీవకళ గలకావ్యములలో మిన్నయే కాని కథావస్తువు ననుసరించి విలువ తగ్గక మానదు. హంసవింశతి యొకనిఘంటు వనినను దప్పు కానేరదు. బేతాళపంచవింశతికవిత యించుమించుగా నంతయు సంస్కారాపేక్ష గలది యనవచ్చును. ఇట్టికావ్యముల దృష్టినే కాక కేవలకల్పనాకథలు, నాద్యసత్కథలు, సత్కావికల్పనా విభూషావహపూర్వవృత్తములు ననుమూఁడువిధము లగు కావ్యములదృష్టియందును నీకావ్య ముత్తమము కాకపోవదు.

ఇయ్యది స్వతంత్రకావ్యము కా దనియు, నాంధ్రీకరణమే యనియు, నాంధ్రీకరణమే మహాకష్ట మనియు నీకవియే యవతారికయందు సుకుమారమగుఫణితిని వివరించి తనభావనాశక్తిని వెల్లడించినాఁడు.

---

* అచ్చుపడిన సంస్కృతమూల మొక్కటి విక్రమార్కచరిత్రము (గద్యపద్యాత్మకము) కలదుగాని యందుఁగల కథలవరుస యిందుఁ గానరాదు. విషయములును భేదముగానున్నవి.

ఉ. ఈసరసోక్తికావ్య మొకఁ డిమ్ముల సంస్కృతభాష నచ్చుగాఁ
జేసిన నట్లె పెద్ద మఱిచేయుట యేటికి యందుఁ జెప్పఁగాఁ
జేసి యనాదరం బురక చేయకుఁడీ విలుకాఁడు తూఁటుగా
నేసిన నదె పాఱ మఱి యేసినవా నిద సూటి గావునన్. ౧-౩౫

ఈపద్య మెంత యు స్వానుభవమునఁ జెప్పిన దనుటకు సందియము లేదు. కాని యాకీర్తి 'మక్కికి మక్కి'గాఁ జెప్పినవాఁడు కాకున్నను నాంధ్రీకరణమునఁ గల ప్రయాసము వెల్లడించెను. ఇఁక నెట్టిభాష నుపయోగింపఁబూనె ననువిషయమున-

చ. తెనుఁగునఁ దేటగాఁ గథలు చెల్పినఁ గావ్యము పొంకులేదు మె
త్తన నస చాల దండ్రు విశదంబుగ సంస్కృతశబ్ద మూఁదఁ జె
ప్పిన నవి దర్భముం డ్లనుచుఁ బెట్టను పీచులఁ గావునన్ రుచుల్
దనరఁ దెనుంగు దేశియును దద్భవముం గలయంగఁ జెప్పెదన్. ౧-౩౭

అని చెప్పి యనువగుతావులం దెల్ల లలితము లగుజాతీయములతో నింపినాఁడు. ఈతనికవితను గూర్చి యేదియు విశేషించి వ్రాయం బనిలేకుండ నవతారికయందుఁ దానే యద్దమువలె నిలిపి యున్నాఁడు.

కావ్యమునకుఁ బదునెనిమిదివర్ణనము లుండవలె నను నియమము పాటింపఁ దలఁచియు వాని నుచితస్థలములయందుఁ జూపెద నని చెప్పి యుండుటయే కాక యాయాయి ప్రసంగములం దాయావిద్యల సంపూర్ణస్వభావమును బ్రదర్శింపనినాఁడు సర్వజ్ఞతకు భంగ మనియు దానికంటె యుచితజ్ఞత ముఖ్య మనియు

'క. ఎప్పటి కే యది ప్రస్తుత, మప్పటి కా విద్యమహిమ మచ్చుపడంగాఁ
జెప్పక సర్వజ్ఞత్వము, చొప్పడునే కావ్య మంతసులభమె ధాత్రిన్'. ౧-౨౧.

అని చెప్పుటమాత్రమే కాక యట్లే చూపియున్నాఁడు.

ప్రథమాశ్వాసమునఁ బద్మిన్యాదిస్త్రీలక్షణములు, ద్వితీయాశ్వాసమునఁ జతుర్విధప్రాకృతములతోను జిత్రరీతులతోను గవితాకౌశలమును, తృతీయాశ్వాసమునఁ బౌరోహిత్యదారిద్ర్యాదిదూషణములను, నాల్గవయాశ్వాసమున నాంధ్రచ్ఛందశ్శాస్త్రమున విశేషించియున్న యతులవిచారమును, బంచమాశ్వాసమున జీమూతవాహనచరిత్రమును, మఱొకతావున మల్లవిద్యయు, మఱొకసందర్భమునఁ జోరవిద్య యు, నింకొక ప్రసంగమున నఱువదినాలుగువిద్యల నామములును, స్వప్నములు, శకునములు మున్నగువానిని విశేషముగానో సామాన్యముగానో ప్రదర్శించెనే కాని విడిచిపెట్టిన యంశ మొక్కటియుఁ గానరాదు. ఈకావ్యమున

నచ్చటచ్చట సందర్భములననుసరించి సార్వకాలికములును సార్వజనీనములు నగు నట్లు చెప్పఁబడి చెదరి యున్న నీతిపద్యము లన్నియు నేర్చి కూర్చినయెడ నొక చిన్న నీతిశాస్త్ర మగును. గ్రంథవిస్తరభీతిచే మానవలసివచ్చినది. కాని యెత్తిమావల సిన వెన్నో విచిత్రకల్పనము లిందుఁ గలవు. వివాదగ్రస్తమై యున్న యొంటిమిట్ట వారంగలువాదము నీకవి యున్నే తీర్చియున్నాఁడు. ధర్మపురి, భువనగిరి, శ్రీశైల ము మున్నగు వానిం జెప్పుచు-

త్రిలోకమాత మహాపాతక సంఘాతవిఘాతానుయాతఁగనియెన్ గంగన్.

క. ఆనదికిఁ బ్రొక్కి ముఖ్యస్నానం బొనరింప డిగ్గి చని యుదకం బా
లోనం దెకతెక నుడుకఁగ, గానద్భుతమైన మహిమఁ గని వెరఁగందెన్.

అని గంగయే గోదావరి యని తెల్పుట కుష్ణగుండమును వర్ణించినాఁడు.

ఉ. ఆకడ నీతిశాస్త్రవిధుఁ డైగుడ నీక్షోని యేఁగె వేడ్కతోఁ
గాకితమూలశక్తి గనిగా నొనరించిన పైఁడిచట్టునా
నేకశిలాభిధానమున నెన్నిక కెక్కి ధరిత్రిలోన నే
పోకలఁబోని యట్టి సిరిపుట్టినయింటికి నోరుగంటికిన్. ౮ ఆ. ౧౫౬

అని యేకశిలానగర మోరుగల్లే గాని యొంటిమిట్ట కానట్లు తెలియఁజేసినాఁడు.

ప్రత్యేకత:— ప్రతికవికిని గల్పనాపాటవముననో, యలంకారముననో, వ్యాకరణముననో, ఛందస్సుననో, భాషయందో కొంత ప్రత్యేకత యుండక మానదు. కల్పనాంశములమాట యటుండ భాషయం దీతఁడు చూపినప్రత్యేకత యనుపమానము. తరువాతికవులయందుఁ గాని పూర్వులయందుఁ గాని లేని యెన్నియో నూత్నశబ్దముల నీకవి వాడియున్నాఁడు. బొనగిలు=బలాత్కృతమగు; కాసించు=కాసెవోయు; ముక్తాశేసలు=ముత్యాలసేసలు, వెంచ=మఱుఁగు; పాఁగు=(తమిళపదము) రహస్యము, వృత్తాంతము; భజనకెక్కు=స్తుతికెక్కు; పరిణయించి=పెండ్లాడి; నెలగ=ధనము; వెట్టము=విరోధి; వితండము=విరోధము; పరిమాళించుట; (పరిఘాళించుట అని బ్రౌనుపాఠము)=మల్లవిద్యాక్రియావిశేషము; వయ్యంది=కొలిమి; ఇట్టియపూర్వపదప్రయోగమున నీకవియొక్క ప్రత్యేకత స్పష్టపడుచున్నది.

వ్యాకరణము:— వ్యాకరణము విషయమయి యారయఁ గ్త్వార్థకమునకు వికల్పసంధియును, నావుడు, మున్నగు నానంతర్యార్థకములసంధియు, నచ్చటచ్చటఁ గలవు. క్త్వార్థకేకారసంధివిషయమున నీతనితోఁ పాటు పెక్కండ్రు కవులుగలరు. కాని యానంతర్యార్థక మగు-డున్ (౬. ౬౩; ౮. ౧౧౫)తోఁ ప్రాచీనకవితయం

దు 'డు' వర్ణకము భావార్థకము. సముచ్చయసహిత మయి యానంతర్యార్థము నిచ్చును. అనుటయున్ వంటిది). పరపదాచ్చునకు సంధిచేసిన కవులుకానరారు. ఈవిషయమున నితఁడు యథేచ్ఛముగా వర్తించెను. ఇట్టి నెఱసులువెదకుట రసాస్వాదనమున కడ్డమేకాని వాస్తవము తెల్పవలసివచ్చినప్పుడు మఱుఁగువెట్టుట ధర్మము కాదు. ఇట్టిస్వల్పప్రమాదము లున్నమాత్రమున నీతని కవితకు నాలేశములు కళంకదాయులు కానేరవు.

ఇఁక నీకవి సంస్కృతశబ్దములయెడ జాగరూకతతో మెలంగినవాఁడే కాని ప్రమత్తుఁడు కాఁడు. ఎచ్చటనేని యొకటిరెం డున్నను బ్రమాద మనుకొన నగునే కాని మఱొండు కానేరదు. "ఏకోనవింశతిమ" ౮-౨. "షడ్వింశతితమ"౧౦-౩౧. ఇట్టి వొకటిరెండున్నను నవి పొరపాటులు కాని యజ్ఞానమునఁ బ్రయోగించిన వనుట యన్యాయము. సంస్కృతపాండితీస్ఫోరకము లగుప్రయోగము లనేకము లిందుఁ గలవు. కాని గ్రంథవిస్తరభీతి నుదాహరింపఁబడలేదు.

కవి, కాలనిర్ణయము:—గోపరాజను నీతఁడు నియోగిబ్రాహ్మణుఁ డనియును, ఇంటిపేరు కోవెలవారనియును బమనేడవశతాబ్దములోనివాఁ డనియుఁ గవులచరిత్రమున నున్నది. ఈతని కేడవపురుషుఁడు వెన్నయామాత్యుఁడు. పెన్నయామాత్యుఁ డనియు నందుఁ గలదు, కాని, పెన్నయామాత్యుఁ డనుట ప్రమాదము. వెలనాఁటిచోడుల దాక్షారామశాసనములందును వెన్నయామాత్యుఁ డనియే యున్నది. ఇఁకఁ గోవెలవా రనుటయు నట్టిదే. ఈకవి తాతతండ్రులనాఁడు పల్లెకొండను బరిపాలించుచున్న 'ఘాణామల్లనృపాలుని' 'రాణన్' అని పదచ్ఛేదముచేసి యెవరో మల్లనృపాలుఁ డని స్థూలముగాఁ గవులచరిత్రము వ్రాసినది.

'కొఱవియన్నామాత్యకుంజరుండు'

కొఱవియన్నయయెప్రుడుగ!'

మున్నగు ముప్పదియిద్దఱమంత్రులచరిత్రమునందలి ప్రయోగములవలనను, చెన్నపురిప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునందలి తాళపత్రప్రతియందలి యాశ్వాసాంతగద్యమువలనను, 'కొఱవి'వారే కాని కోవెలవారు కారని తెలియుచున్నది. (శబ్దరత్నాకరకారుఁడు కొండమీఁదివా రనియెను) ఏదియేని లేఖకప్రమాదమున, కోవెలవా రని యున్న తాళపత్రప్రతి యాధారమునఁ గవులచరిత్రమున నట్లెక్కియుండును. ఈగోపరాజున కేడవపురుషుఁ డగు వెన్నామాత్యుఁడు వెలనాఁటిపృథ్వీశ్వరుని రాజ్యభారధురంధరుఁ డనియు, నవక్రవిక్రమశాలి యనియు సనద్ధవోలు

(చందవోలు) నెలవుగాఁ గలవాఁడనియుఁ బ్రథమాశ్వాసమున ౮౧ వ పద్యమున వర్ణింపఁబడినది. "కలుషమండలిక"... ...ఇత్యాది.

ఇందలి బిరుదములు వెలనాఁటిపృథివీశ్వరునివి కావు. వెలనాఁటిపృథివీశ్వరరాజ్యభారధుర్యుఁ డనునది యు నాబిరుదావళిలో నొకటి యని యాశ్వాసాంత గద్యమునందలి 'వెలనాఁటిపృథివీశ్వరరాజ్యసముద్ధరణ' అనునదిచెప్పుచున్నది. కావున నీవెలనాఁటి పృథ్వీశ్వరుని కాలమునుబట్టి వెన్నయకాలము నిర్ణయింపనగును.

శైవమతాచార్యుఁ డగుపండితారాధ్యుని కాలనిర్ణయమునకై శివతత్త్వసారపీఠికయందుఁ గొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగారు పై వెలనాఁటిపృథివీశ్వరునికాలము నిట్లు నిర్ణయించినారు. పండితుఁడు, చందవోలు వెళ్ళునప్పటికి వెలనాఁటిచోడుఁడు పాలించుచున్నాఁ డనియును, నాతనికి మనుమఁడు పృథివీశ్వరుఁ డనియుఁ,జోడునికాలము క్రీ. శ. ౧౧౧౩సం. మొదలు ౧౧౮౦సం. వఱకు ననియు వివరించిరి. 'పృథ్వీశ్వరుఁడు ౧౧౮గి వఱకే రాజ్యమునకు వచ్చినట్లు తోఁచుచున్నది' అని మఱొకవాక్యము. ౧౧౮గి నాఁటికే యని యర్థము కావలయును. వెన్నామాత్యుఁడు పృథ్వీశ్వరునితండ్రి యగుగొంకరాజునాఁడే మంత్రి యయ్యెను. గొంకరాజు బహుస్వల్పకాలముననే మరణింప బాలుఁ డగుపృథ్వీశ్వరునిఁ బెంచి పెద్దవానిని జేసి రాజ్య మభివృద్ధిలోనికిఁ దెచ్చి యుండవలెను. అప్పుడే పృథ్వీశ్వరరాజ్యసముద్ధరణబిరుదము సార్థకము కాఁగలదు.

వెన్నామాత్యుఁడు గొంకనృపాలునిమంత్రిగా నున్న ట్లీక్రింది చోడరాజుల దాక్షారామశాసనమువలనఁ దెలియఁగును.

Vol. IV No. 1204 -"(స్వస్తి)శ్రీ వెలనాంటిచోడేంద్రపతే స్సూనుర్మహీమండనః శ్రీమా(న్గొం) కమహీపతి..." No. 1205... స్మంత్రిశిఖామణిర్బుద్ధినిధి శ్శ్రీవెన్న(నామాసు)ధీః"...అని యుండుటవలన నాగొంకనృపాలుని కాలముననే మంత్రిత్వము వహియించి, యాతనిపిమ్మటఁ బృథ్వీశ్వరుని రాజ్యమును సంరక్షించియుండును. గొంకనృపాలునినాఁటికి వెన్నయ్యయును యువకుండై యుండును. పృథ్వీశ్వరునికాలమునందును జాలభాగ ముండి యుండును. కాన ౧౨౮౦ దాఁక వెన్నామాత్యునికాలము; అధమపక్షము ౧౨౨౦ దాఁక నేనియు నై యుండును. ఈవెన్నయ్యకుఁ బౌత్రుఁడు, అమరేశ్వరుఁ డని యే గాని పుత్రుఁ డెవ్వఁడో యీగ్రంథమునఁ గవి చెప్పలేదు. ఆతఁడు లేఁబ్రాయమున మరణించెనో లేక యప్రసిద్ధుఁడై యుండెనో కారణ మూహింపఁజాలను. మనుమఁ డగునమ

రేశ్వరునకు, అన్నయ, సింగయ యనునిద్దఱు కుమారులు. ఇందలియన్నయ ము ప్పదియిద్దఱుమంత్రులచరిత్రమున వర్ణింపఁబడియున్నాఁడు.

సీ. ఘనదానకర్ణుఁడై గండపెండెము దాల్చెఁ గొఱవియన్నామాత్యకుంజరుండు

క. హరి సిరిని వలచు సిరియును, సరుసగ హరిఁగోరుఁగొఱవియన్నయమెప్రుడున్
వరకీర్తిసతినివలచును, వరుసన్ వరకీర్తి యతని వలచు సతతమున్.

మున్నగుపద్యములం బట్టి యీయన్నయమంత్రి మహోదాత్తుఁడైన ట్లున్నది. అట్లున్నను గవి తననాఁటికి దూర మగుట యుఁ దాను, అన్నయ్యతమ్ముఁ డగుసింగ యశాఖలోనివాఁ డగుటయుఁ గాఁబోలు నాతనిని గూర్చి, యీకావ్యమున విశే షముగాఁబ్రశంసింపలేదు. కాని యాతనిపుత్త్రుఁ డగు పెద్దిరాజునుగూర్చి పల్లెకొండ జనపాలుఁ డగుమల్లనదేవరాజుచేఁ గుంచెలు, నందలములు, నెల్లియుఁ గైకొన్నవాఁ డని ప్రశంసించెను. గోపరాజున కీతఁడు పెద్దముత్తాత.

ఇఁకఁ దనముత్తాత యగుసింగయను గూర్చి విశేషించి చెప్పలేదు. ఈసిం గనకు అబ్బయ, గోపయ, సత్తెనారన, యనుముగ్గురు కొడుకులు గల రనియుఁ, దనతాత యగుగోపరాజునకు నన్న యగు అబ్బయకొమాళ్లు రామరాజు, కేసన, బాచిరాజు- అనువారలు ముగ్గురును- అనపోతకుమారసింగయకు మంత్రులుగా నుండిరనియుఁ జెప్పెను. (చూ. ౧-౮౮) వెన్నామాత్యునికి నాఱవతరములోని వా రగుటచే వీరు ముగ్గురును నించుమించుగా ౧౪౦౦ దాఁక నుండి యుందురు.

వెన్నయ... ... ... ...౧౨౨౦ దాఁకను
ఆపై ౨౦ ఏండ్లే యతనిపుత్త్రునికాలము చూచుకొన్నను ౧౨౪౦ దాఁకను,
తరువాతఁ బౌత్త్రుఁ డగు నమరేశ్వరునికాలము- ౧౨౮౦ దాకను,
నాల్గవతరములోని యన్నయసింగయలకాలము- ౧౩౨౦ దాఁకను,
అయిదవ తరమగు పెద్దిరాజు, అబ్బయ, గోపనార్యుఁడు, సత్యనారనయు- ౧౩౬౦ దాఁకను,

ఉండియుందురు. ఇందలిపెద్దిరాజు కొడుకు లగు రామరాజు, కేసన, బాచిరాజులు ౧౩౬౦ మొదలు ౧౪౦౦ దాఁక నుండు రనుటకు సందియము లేదుగదా! ఏక శిలానగరాధిపతి యగురేచర్ల సింగమనాయనిపుత్త్రుఁడు 'అనపోతనాయఁ డనియు, నతనిపుత్త్రుఁడు రెండవసింగమనాయఁడు (౧౩౮౦—౧౪౦౦) దాఁక నున్నాఁడ నియునాంధ్రవాఙ్మయసంగ్రహకారునిసిద్ధాంతము! ఈయనపోతసింగయకే రామరా జాదులుమంత్త్రులైయుందు రని సమకాలికత్వమును బట్టి నిశ్చయించుటసుసాధము,

ఆరామరాజాదులకు సమానతరములోనివాఁడగు కసువరాజును నించు మించుగా ౧౪౨౦ సంవత్సరముల ప్రాంతములోనివాఁడు కావలసివచ్చును. (ఈ కసువరాజు మనకవికిఁదండ్రియనియు 'రాణామల్లనరేంద్రునకుఁబరమగురులై శైవాచారప్రథమసింహాసనాసీను లైన బ్రహ్మదేవయొడయల కూఁతుఁ గామాంబికయను కామినీరత్నంబుఁ బరిగ్రహించి వేముగల్లునివాసియై యుండె ననియు నిందుఁజెప్పఁబడియె.)

కావున నీకవి ౧౪౬౦ దాఁటియే జీవించియున్నాఁడనవచ్చును. ఏమనఁ బూర్వకవిస్తుతియందు, 'అనఘు హుళక్కిభాస్కరు మహామతిఁ బిల్లలమఱ్ఱి వీరరాజును......అనుటవలనఁ బిల్లలమఱ్ఱి వీరభద్రునికిఁ దరువాతివాఁడని యనుమానము కల్గవచ్చును. కాని సమకాలికుఁడనినను సరిపడును. క్రీ. శ. ౧౨౪౦ లోని వెన్నామాత్యుని కేడవతరమువాఁడగునీగోపరాజు ౧౪౮౦ ప్రాంతముదాఁక నుండవచ్చును గదా! ఒకతరమున హెచ్చినను, నొకతరమునఁ దగ్గినను దరమునకు ౪౦ సంవత్సరముల చొప్పునఁ గదా చరిత్రకారులు కాలనిర్ణయముచేయుచున్నారు. కావునఁ బిల్లలమఱ్ఱి వీరనకు సమకాలికుఁడు కావుట నిశ్చయ మనవచ్చును. ఇఁకఁ, గవులచరిత్రములోని పదియేడవశతాబ్ద మనుసిద్ధాంతము స్థూలదృష్టితోఁ జేసినదేమో యనిపించుచున్నది. రాణామల్లనను గూర్చియును, వెన్నామాత్యుని గూర్చియు, వ్రాసినట్లే యీకాలనిర్ణయమును, నట్లే యందుఁ జేయఁబడినది.

ఈతఁడు ప్రసంగవశమున నాల్గవయాశ్వాసములోఁ జెప్పిన ఛందస్సందర్భమునఁ బనుమాఁడువట్లు తెల్పినాఁడు. భీమనకాలమునాఁటికిఁ బదియే కలవు; అనంతునినాఁటి కిరువదియైనవి. ఈతఁడు భీమనపద్యభాగములనే వాఁడినాఁడు. ఇదియు నాలోచింపవలసినదే.

నవమాశ్వాసమున 69 వ పుటలో ౧౦౫ వ పద్యముతరువాత రెండు పద్యము లర్థముకానివి కలవు. ఈరెండుపద్యములకు రెండువిధము లగుపాఠములు దొరకినవి. వాని నీక్రిందవ్రాయుచున్నాఁడను. ఎచ్చట నైన సరియైన పాఠముదొరకినయెడఁ బ్రచురించి యాకొఱంత దీర్తురుగాక యని విద్వల్లోకమును గోరుచున్నాఁడను.

ఆ. తొలుపుతిరములు మెరపులు వంకమోళ్లు, తిలలు జివ్వడీలు తీపివేళ్లు
లెక్కమూలుచమనుచు లిక్కొట్టిపుడుకుచు, గొందినిడక తెంపు లెందుఁగలవు.

క. పుడుగులలోఁ జుట్టముగా, నడవలు గ్రామములు తవులు నాదంబులు నం
గడపుగ నెరయఁగఁ బాలే, ర్పడ...అయ్యె లిట్టి వడనివి నిలిపె౯.

అనికొన్నిప్రతులు. వీనికేపాఠాంతరము లిట్లు గలవు.

ఆ. తెలుపు విరము మేరుపులు వంకమోరలు, తిలలు జప్పటీలు తీపివేళ్లు
లెక్క మలుచమునుచు దిక్కొటి యుడుగుచు, గొంది నిడక కెంపు లెందుగమ్మ.

క. పుడువులలోఁ జిట్టముగా, నడఁవలుగామములు నాతంబులు నం
గడవు నెఱుంగం బా లే,ర్పడ సిద్ధి గలవయ్యె వృద్ధి పాడనివిప్పే.

వేఱొకవ్రాతప్రతిలో—

గీ. తొలుపుతిరములువంకమోరలుపరపులు, తెల్లలును చప్పటాలుచు తీవెవేళ్లు
లెక్కమలుచమ్మనుచును దాపెక్కు పుఱుగు, గొండువిడువక వేగెంపులెండుగొమ్మ.

క. పుడుగులలో బుట్టముగా, నడవలు గామములు దవులు నాంతంబులునం
గడము నెరయంగ బాకీ, ర్పడ సిద్ధికయయ్యె విద్య వడసివినిలిపె౯.

ఈపద్యము లెవ్వరును నేనిఘంటువునను వాడియు నుండలేదు.

కృతిసమర్పణము:—ఈకవిశిఖామణి తనకావ్యమునకు శివకేశవుల నుభయులను గృతిపతులనొనర్చినాఁడు. తిక్కనసోమయాజి నాచనసోమనలవలెహరిహరులనుభయులనుసమానభక్తితో సేవించినయద్వైతి. అందునను 'తథాపిభక్తి స్తరుణేందుశేఖరే' అనినట్లు తొలుత శివస్తుతితో నారంభించినాఁడు. మఱియునాశ్వాసాంతపద్యములందొకపద్యము హరసంబోధనములతోను, నొకటి హరిసంబోధనములతోను, వేఱొకటి హరిహరసంబోధనములతోను ముగించుచువచ్చెను.

భోజుఁడు సింహాసన మెక్కుటకై ముప్పదిరెండుమాఱులు వచ్చునప్పుడును హరినో హరునో ధ్యానించుచు వచ్చినట్లు ప్రతికథమొదటను ద్వితీయాంతములతో లలితమగునచ్చతెలుఁగుపదములతో నొక్కొక్క పద్యము నెలకొల్పెను.

హరిహరులను సమానముగా ధ్యానించుట తిక్కన కవీంద్రునిమార్గమేయయ్యెను, భిన్నభిన్నముగా వర్ణించి హరిహరుల నేక మొనర్చి ముగించుచువచ్చురీతి నాచనసోమనార్యుని యుత్తరహరివంశద్వితీయాశ్వాసమునందలి హరిహరస్తవమును స్మరణమునకుఁ దేకమానదు. కథలయందు సందర్భానుసారముగా అంబికను, సూర్యునిగూడ సరసముగా స్తుతించియున్నాఁడు. కేవలము భక్తితత్పరుఁడై శివకేశవాత్మక మగుభగవంతునే కృతిపతి నొనర్చి యీకవి తాను ధన్యుఁడగుటయే కాక లోకమునుగూడ ధన్య మొనర్చిన మహానుభావుఁడు. మఱియు

నాశివకేశవుల వర్ణించుపట్ల మృదువైన వ్యంగ్యముతో భావనాపటిష్ఠత వెల్లడించె ను. అదియే కదా కావ్యమునకు జీవము! చూడుఁడు.

చ. పులుఁగులపెద్దవారువము పోటరిబిడ్డఁడు తాఁగరాతు పా
ములగమికాఁడు సెజ్జ నలుమోములవాఁ డిలుదీర్చుపట్టి వే
ల్పులు బలుబంటు లాకమలపొల్తుక తెల్లనితల్లి పెద్దకో
డ లనుచు నెల్లవారుఁ బొగడు దగునల్లనివేల్పుఁ గొల్చెదన్. ౧. ౨.

క. వెలిపట్టును బులితోలును, మలయజమును బూదిపూఁత మణులున్ ఫణులున్
దిలకము నెఱగన్నుంగలి, వెలఁదియు మగవాఁడు నైనవేల్పుం దలఁతున్.
౭. ౧౧౫.

ఇఁక విక్రమార్కచరిత్రమును రచించినజక్కనకవి యీతనిని గాని యీగోపరాజు జక్కనను గాని స్మరియింపకపోవుటవలన నొకరిగ్రంథము నొక రెఱుఁగరని యనుకొనవలసి యున్నది. జక్కన ౧౪౦౦—౨౦ సం. లలో విక్రమార్కచరిత్రము రచియించినాఁడని కవులచరిత్రము తెల్పుచున్నది. జక్కన యీకవికంటెఁ గొలఁదిపాటి ముందుకాలమువాఁడే కావలెను. ఆతనికంటె మిన్నగాఁ జెప్పఁ దలంచినట్లు ను నిందుఁ గానరాదు. కవిత్వతారతమ్యములు చూచిన యెడల నీకవి జక్కనకుఁ గొంచెపాటి వెనుకవాఁడే యగును. ఆతనివలె నిమిడికగఁ జెప్పఁగలకవి యరుదు. ఆకవిత్వముముం దీకావ్యము కొంచెము వన్నె తగ్గి యిమిడిక లేనట్లుండకమానదు. అంతమాత్రమున నియ్యది గౌరవపాత్రము కాకపోవదు—మలిచిన రత్నములహార మొకటి, విరిసినమల్లెపూవులదండ యొకటి. దాని తేజస్సు, దీనిపరిమళమును మనోహరములే! సహజమైన శైలితో లలితము లగు జాతీయములతో మనోహరము లగువర్ణనలతో నీకావ్యము ప్రాచీనకావ్యములలోఁ బ్రశస్తి గాంచి మించినదే. జక్కనగోపరాజుల కవితాశైలుల భేదము విచరింపఁ బూనినచో గ్రంథవిస్తర మగు నని విరమించుచున్నాను. అయ్యది ప్రత్యేక మొకవ్యాసముగా వ్రాసి ముందు ప్రకటింతును.

వెంపరాల సూర్యనారాయణశాస్త్రి.

# విజ్ఞాపనము.

---

పాఠకమహాశయులయాదరమున భాషాభిమానులకృపవలన సింహాసనద్వాత్రింశిక ప్రథమభాగము (మొదటియైదాశ్వాసములు) పూర్తియైనది. ఇప్పటికిఁ బండ్రెండాశ్వాసములును సమగ్రముగాఁ బ్రకటింపఁగలిగితిమి. అనేక ప్రతు లుపలబ్ధములైనను దప్పు లన్నిటిలోను సాధారణ్యమును వహించినవి. సందేహము లన్నిటిలో సందేహములే యైనవి. అనర్థకపాఠభేదములు మెండుగాఁ గలవు. అన్నిటిని జూచి యవసరమైన పాఠములను, భేదములను మూలమునను బుటలక్రిందనను జేర్చినారము. సందర్భశూన్యమైనవానిని బొత్తిగా విడిచిపెట్టితిమి. కొన్ని చెప్పవలసినముఖ్యవిషయములు రెండవభాగము మొదటఁ జెప్పియున్నాము. కావున విశేషించి యిచటమరలఁ జెప్పలేదు.

ఈగ్రంథమును మేము ప్రచురించుటలో సాయపడినపలువురుపండితులకును దమవ్రాతప్రతి నెరవిచ్చిన మ. రా. శ్రీ పోతాప్రెగడ బ్రహ్మానందరావుపంతులుగారికిని సమగ్రగ్రంథమునకు యథామతిం బీఠికరచియించి యొసంగిన బ్ర. వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారికిని మే మెంతయుం గృతజ్ఞులమై వందనశతంబు లర్పించుచున్నారము.

ఇట్లు,

ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శులు.

శ్రీరస్తు.

# సింహాసనద్వాత్రింశిక.†

(ప్రథమభాగము)

## ప్రథమాశ్వాసము

—: కృత్యాది, దేవతాస్తోత్రాదికము :—

శా. శ్రీమత్పర్వతనందనా[1]తనులతాశ్లిష్టాంగ మై బాహుశా
ఖామధ్యంబున నున్న పన్నగఫణౌఘంబు ఫలంబు లై యొప్పను
ద్దామంబౌ శశికాంతి పుష్పరుచి నొందంగా జటాపల్లవ
స్తోమంబౌ హరపారిజాతము నుతింతు[2] న్వాంఛితాప్తి కిన్. ౧

చ. పులుఁగులపెద్ద వారువము, పోటరి బిడ్డఁడు, ఱాఁగకాతు♦, పా
ములగమికాఁడు సెజ్జ, నలుమోములవాఁ డిలుఁదీర్చుపట్టి, వే
ల్పులు బలుబంటు, లాశమల[3] పొల్తుక, తెల్లనితల్లి పెద్దకో
డలనుచు నెల్లవారుఁ బొగడం దగు నల్లనివేల్పుఁ గొల్చెదన్. ౨

ఉ. దక్షిణనేత్రకాంతి నుచితంబుగ నర్థవికాస మొంది వా
మాక్షిరుచిప్రసారమున నర్ధము విప్పకయున్న పుండరీ
కాక్షుని నాభిపద్మనిలయంబునఁ దుమ్మెదభంగి లోలుఁడై
యక్షయ వేదనాదమయుఁ డైన విరించిఁ దలంచి మ్రొక్కెదన్. ౩

ఉ. కట్టినపుట్టముం దనువు గద్దియతమ్మియు నక్షమాలయుం
బట్టినచిల్కయు న్నగవుఁ బాపటజల్లియు నొక్కవన్నెగాఁ
బుట్టుచుఁ బుట్టువిద్యలకుఁ బుట్టినయి ల్లనఁ జెల్లి బ్రహ్మనా
కట్టొనరించి తన్ముఖవికాసినియౌ సతి మమ్ముఁ గావుతన్. ౪

ఉ. సిద్ధము లైన భూషణమణిప్రకరద్యుతు లన్నిదిక్కులన్
దొద్దలువుచ్చి తల్లిచనుదోయిసరిం[4] దలకట్టు మించఁగా
ముద్దులు సూపుచుం బసిఁడిముద్దగతిం దొడమీఁదనాడు నా
ముద్దుగణేశునిం దలఁచి మ్రొక్కెద నీ కృతికార్యసిద్ధికిన్. ౫

క. దుర్మదపరివృఢసురగణ, త్రైలోచను సురశరణ్యు ధృతశక్తి ఫణి
ద్విణ్మయు వాహను,[5]హరినిభు, షణ్ముఖు నభిముఖునిగాఁ[6] బ్రశంసింతు మదిన్

† సింహాసనద్వాత్రింశతియనియుం గలదు 1. నందినీ. 2. భజింతున్. ♦ రాఁగకాతు, రాగకాతు. 3. లాల్కలిమిపొల్తుక. 4. నడిం. 5. హరిశ్రియ. హరిప్రియు; హరిశిఖుఁడు. 6. నతిసుముఖుఁగా.

క. ప్రవిమలుఁ డని గ్రహరాజని, కవితాప్రియుఁ డని జగత్ప్రకాశకుఁ డనియున్
భువివిక్రమార్కనృపసంభవకారణుఁ డనియు[1] లోకబాంధవుఁ దలఁతున్.

క. పులుఁగున కై యెవ్వనిమది, నొలికినశోకము లకారయుతమై కవితా
కలనకుఁ దెరు వయ్యెఁ దలంపుల నాతని గొల్తుఁ బుట్టఁ బుట్టిన సుకవిన్. ౭

ఉ. శ్రీవిలయంబునాఁగ మురజిద్గుణరత్ననివాస మై యుపా
ఖ్యానతరంగిణీభరిత మై కడగానఁగరాని భారతా
ఖ్యానపయోధిలోనఁ గల మై నిజయుక్తి భజింపఁ గర్ణధా
రానుకృతిం గృతార్థత మహాఘనుఁ డౌ మునిఁ బ్రస్తుతించెదన్. ౮

క. ఆ భారతపర్వత్రయ, మీ భారతవర్ష మెల్ల నెఱుఁగఁ దెనుఁగుగన్
శ్రీభారతిగతిఁ జెప్పిన, నాభాప్రకమును[2] దలంతు నన్నయభట్టున్. ౧౦

క. వేముల వాడకు శుచియై, [3] లేములవాడం జరించు వేములవాడం
దా మెఱసిన భీముని నుత, భీముని బలభీము విమతభీమునిఁ దలఁతున్. ౧౧

చ. అనఘు హుళక్కి భాస్కరు, మహామతిఁ బిల్లలమఱ్ఱి పీరరా
జును, ఘను నాగరాజుఁ, గవిసోమునిఁ దిక్కనసోమయాజిఁ, గే
తనకవి, రంగనాథు, సుచిత్ఙ్ఞుని నెఱ్ఱన, నాచిరాజుసో
మన, నను శేవ్యసుం, దలఁతు మస్కలదంబ్రుల సత్కవీంద్రులన్. ౧౨

వ. అని యిట్లు సకలవరప్రదానకారణదేవతలను జతురవ్యాఖ్యానవద్యగద్య
పద్యవిద్యావిద్యోతితు లయిన కవీశ్వరులనుం బ్రశంసించి తత్ప్రసాదాసా
దితసహజసాహిత్యతరంగితాంతరంగుండ నై సకలజనసాధారణం బగు సత్క
ట్లని విన్నవించె[4]. ౧౩

ఉ. ఆదరణంబు లేక చెడనాడిన బాణమయూరకాళిదా
సాదులకైనఁ దప్పు గల దన్యుల కేమని చెప్ప వీనిలో
నేదియుఁ గాదు పొమ్మనక యిందుల చంద మెఱింగి తప్పినం
గా నని తీర్చి యొప్పు గని కైకొని మెత్తురు గాక సత్కవుల్. ౧౪

ఉ. [5]మానుగఁ దప్పులున్న ననుమానము సేయక మోదమానస
న్మానసు లైనవారు పలుమాఱు పరీక్ష [6]లొనర్చి తీర్చినన్

---

1. కారణమనియు 2. నాభరతుండని, నాభావకుఁడని 3. వే, లే. యని రెండుప్రతుల రెండురీతులు (వేములవాడ, లేములవాడ,) 4. వితర్కించెద. వినిపించెద 5 మానము దప్పనీక. 6. లొనర్చి రేనియున్.

హీనకవిత్వ మైన మెఱుఁ గెక్కదె నేర్పరులైనవారిచే[1]
పానలఁబట్టి తీర్చినను సన్నపురత్నము వన్నె కెక్కదే. ౧౫

ఉ. భావరసానుకూలమృదుపాకపదార్థసమృద్ధి లోకసం
భావన నొప్పుకావ్యముల మర్మము[2] గానఁగ లేక దుర్మతుల్
కా వనఁ గాని యెట్టికడఁ గట్టడిఁ జెప్పఁగ నేర, రెల్లెడం
ద్రోవన కాక కుక్కలకు దొంతులు వేర్వఁగ నేర్పు గల్గునే. ౧౬

చ. చులుకని పద్య మైనఁ గడుఁ జోద్యము చేయుచుఁ జిన్నవానిఁ బె
ద్దలు గొనియాడఁగాను విని తప్పులుపట్టఁదలంతు రక్షముల్
బిలిబిలి మాట లాడఁ దనుఁ బెంచినవానికి ముద్దుగాక యా
పలికెడు చిల్కపిల్లఁ గని బాగురుఁబిల్లులు[3] సంతసిల్లునే. ౧౭

ఉ. భీమనపద్య మన్నఁ గడుఁబ్రీతి వహించుచు మేలుమేలు నా
నే మిది చెప్పినార మన నిక్కమె ప్రాసము గూర్చినాఁడ వా
నే మిది కాదు దీనివడి కిక్కడ కర్థ మిదెట్టి దీగణం
బే మని పెట్టినాఁడ వని యొగ్గులుపట్టుఁ గుబుద్ధి పెద్దలన్. ౧౮

క. వివరికి వివరించిన కృతి, చవిపాలం బంచదార సరి గూర్చుట[4] యా
యవివేకికి వినిపించిన, కవిత వఱుతఁ జింతపండు గలుపుట చుమ్మీ. ౧౯

ఉ. పూనినరీతి వానితలఁపు ల్వడిఁ బ్రాసములుం జలంబునం
బానగిలంగ నీడ్చి యొకపద్యముఁ గూర్పఁగవచ్చుఁగాక యా
ఖ్యానకథానుకూలముగఁ గావ్యముఁ జెప్ప వశంబె సన్నమై
కానఁగ జల్లి నేయునది కట్టుకుపుట్టము నేయ నేర్చునే. ౨౦

క. ఉర్విఁ గలశబ్దజాలము, నిర్వచనస్థితుల నెఱిఁగి నేర్చిన విద్యా
నిర్వాహకుఁ డనఁ జెల్లెడు, సర్వజ్ఞుఁడు గానివాఁడు సత్కవి యగునే. ౨౧

క. ఎప్పటి కేయది ప్రస్తుత, మప్పటి కావిద్య మహిమ[5] మచ్చుపడంగాఁ
జెప్పక సర్వజ్ఞత్వము, చొప్పడునే కావ్య మంత సులభమె ధాత్రిన్. ౨౨

క. దుర్వాదము గాకుండను పూర్వపుఁగృతిఁ జెప్పుసుకవిపుంగవునకుఁ దా
సర్వజ్ఞుఁడ నని మాటల గర్వింపఁగ నేల తోడవు గానంబడఁగన్. ౨౩

క. చనుఁ "గవివైభవవిద్యా" యని చదువుటఁ గావ్య మధిక మదియును నల్లి
ల్లునుగుడియుఁ జెఱువునిధియును, వనము సుతుఁడు సంతతులుభవస్థితిగతికిన్

1. నేర్పరులైనవోజ్ఞులై. 2. పద్ధతి. 3. బావురుఁబిల్లులు. 4. గూర్చునహా.
5. మర్మమచ్చు...జెప్పెడు.

క. ఎవ్వరు కృతు లొనరింపుదు, రెవ్వరు కృతిలోన వినుతి కెక్కను గోరుచే
నవ్విమల కీర్తి సంతతు, లివ్వసుమతిఁ జెదక నిలుచు నివకల్పముగన్.

క. సుగుణులు "బాణోచ్ఛిష్టం, జగత్రయ"మ్మనఁగఁ గొంత చదువఁగఁ బ్రియమే
తగఁ దోడంటిన[2]పాలిం, పుగఁ బెరుఁ గయియున్న నది యభోజ్యంబగునే.

క. సంబంధము లగురసభా, వంబులు మునుకంటె నభినవంబులు గలవే
యంబుధిని కాక బహురత్నంబులు వర్తకుల కేమి తాఁ బండినవే. ౨౭

క. తల్లి యగు వాణికరుణం, దొల్లిటికవు లధికు లనఁగ దోఁచిరి పిదపన్
బల్లిదు లిప్పటికవులు, తల్లికిఁ గడగొట్టు[3]కొడుకు దాఁ బ్రియమగుటన్.

క. ఏజనులకైన సద్గుణ, యోజితులై భావ మెఱిఁగి యుచితార్థకళా
రాజితు లగు కవిరాజుల, రాజులు చేపట్టిరేని రాజ్యము గాదే. ౨౯

క. సరసులు చేపట్టినచో, విరసం బగుకావ్యమైన వినిపించిన నా
దరణీయం బయి వెలయదె, ధరఁ బుష్పాలఁ దాల్చి తుంగ[4]తల కెక్కఁగలేనా.

క. అప్పరమేశ్వరు కరుణం గుప్పలు గొను విక్రమార్కు గుణముల కొఱకై
చెప్పెద రసభావంబులు, ముప్పిరిగొనునట్లు కథలు ముప్పదిరెండున్.

చ. తెనుఁగున దేటగాఁ గథలు చెప్పినఁ గావ్యము పొందు లేదు మె
త్తన పసచాల దంద్రు విశదంబుగ సంస్కృతశబ్ద మూఁదఁ జె
ప్పిన నవి దర్పముండ్రనుచుఁ బెట్టరు పేరులఁ గావునన్ రుచుల్
దనరఁ దెనుంగు దేశియును దద్భవముం గలయుంగఁ జెప్పెదన్. ౩౨

క. పదిలముగ మృదులవచనా, స్పదపదసంపదల రసము పసపడక మహా
పదముల నేనసుజల్లులఁ, బొదుపెట్టిన దుడుకుఁగవిత[5]పొనలు నెసఁగలేనా.

గీ. తనవచోవిశేష మెనయక పూర్వక, థాముఖోక్తిఁ జెప్పు టేమిక్రిందిది
యొకఁడు గోలవట్టి యొయ్యనఁ గొనిపోవ, నంధుఁ డెవనికైన నడుగుటనుదె.

ఉ. ఈసరసోక్తికావ్య మొకఁ డిమ్ములఁ సంస్కృతభాష నచ్చుగాఁ
జేసిన నట్లు వీఁడు మఱి చేయుట యేటిది యన్నఁ జెప్పఁగాఁ
జేసి యనాదరం బిటకఁ జేయకుఁడీ, విలుకాఁడు సూటిగా
నేసిన నందె పాఱ మఱి యేసినవానిది సూటిగాపునన్. ౩౫

చ. తెలుఁగున కెల్లఁ దల్లి యగుఁ దెల్లము సంస్కృతభాష యందులోఁ
బలుకు తెలుంగుచోఁ బదవిభాగము నన్వయ మర్థమంచు నీ

1 నవ్విభుల. 2. తోడంటునఁటొ. 3. గడపుట్టు 4. వంకఁదుంగ. 5. నుండుకవిత

మలకలకంటె నందుల సమర్మము దేటతెనుంగ యొప్పు నా
కొలఁది ప్రియంబు గాదె చెఱకు ల్దినుకంటె రసంబు గ్రోలినన్. ౩౭

క. పురసాధుజలలీలాంబుధి, పరిణయనయవిప్రలంభపతిగుణసుత భా
స్కరచంద్రోదయరణగతి, గిరివనదూతకృత్యరతులఁ గృతి చెప్పఁదగున్.

క. కావునఁ బదునెనిమిది యగు, నీవర్ణన లచటనచట నించుక బెరయం
గావించెద నిటఁ బని కిని, రావనకుఁడు లక్షణాభిరామము లగుటకా[1].

వ. అని విన్నవించి కృతకృత్యుండ నై సింహాసనద్వాత్రింశతి కథాకథనమూల
కారణం బైన యంబికారమణుఁడును[2] మత్కవితాసంపత్తి సంధాయకుం
డగు లక్ష్మీనాయకుండును గావ్యనాయకులుగా నియమించుటం జేసి. ౩౮

సీ. పాఁపపెండెముగాక పసిఁడియందియ యునుపఁగుఁదామరలపై నమరువాఁడు
పెద్దమొకముతోలు నిద్దంపుఁబట్టును మొలదిండుగాఁ గట్టి మురియువాఁడు
ఎముకపూసలునుముత్యములుఁ జేరులుగాఁగ నక్కునఁ దాల్చి పెంపెక్కువాఁడు
పునుకయుం బెనుగుల్లయును గేలుదమ్ముల నంచలమూడ్కిఁ బాటించువాఁడు
సగము పోడవునఁ దెల్పు నాసగము నల్పు
నయ్యు మెడ నొక్కవన్నియ యగుచు మేను
లెనయ ముక్కంటియును వెన్నుఁడును ననంగఁ
బొల్చు నావేల్పు కబ్బంబుఁ బ్రోచుఁగాత. ౪౦

—: కవివంశావతారవర్ణనము :—

క. తత్పదపద్మారాధన, తత్పరులను రాజమంత్రిధర్మజ్ఞుల మా
సత్పురుషుల వినిపించెద, మత్పారంపర్య మొకక్రమంబునఁ దెలియన్.

సీ. కలుషమండలిక భేక ఫణీంద్రుఁ డన రాయగజగంధవారణఖ్యాతి మెఱసి
వీరఘోట్టవిభాళుఁ డార్యాఢ్య బిరుదవిరోధి కళింగనిరోధ యనఁగ
వెలసి నానాఁటికి వెలనాఁటి పృథివీశ్వరుని రాజ్యభారధుర్యుం డనంగ
నారెలు గన్నడి లఱవలుఁ దెలుఁగులుఁ దనబిరుదందియఁ దగిలికొలువ
నెగడి సనదప్రోలు[3] నెలవుగా భూసుర, వంశసాగరామృతాంశుమూర్తి
చక్రవర్తి మాన్యసౌజన్యధన్యుఁడు, విక్రమార్కనిభుఁడు వెన్నవిభుఁడు.

ఉ. సాంద్రజవంబున, [4]స్మృతి, విజస్థితి, నేర్పునఁ, బేర్మి, సత్యవృ
త్తిం, ద్రుతబాణ[5]పాతనిరతిం గళల, స్సరివత్తు రెల్లు వ

---

1. మెఱయున్, మెరయున్. 2. ముక్తివితానసంపద్విధాయకుండు.
3. నందప్రోలు, 4. సాంద్రబలంబున 5. దృఢబాణ.

క్షీంద్రుఁడుఁ బన్న గేంద్రుఁడు నగేంద్రుఁ డుపేంద్రుఁడు నింద్రుఁడున్ హరి
శ్చంద్రుఁడు రామచంద్రుఁడును జంద్రుఁడు వెన్నయ మంత్రిచంద్రునిన్[1]

క. అమరఁగ వెన్నయమంత్రికి, నమితశశాంకకీర్తిపాత్రుఁ డగుపౌత్త్రుం డై
యమరేశ్వరమంత్రినిభుం, డమరేశ్వరమంత్రి వెలసె నార్యులు వొగడన్.

క. [2]సంగతి నమరేశ్వరునకు, గంగాంబకుఁ బుట్టి రతిఘను లన్నయయున్
సింగయమంత్రియుఁ దమలో, నంగీకృతరామలక్ష్మణాకారములన్. ౪౫

ఉ. అన్నయనామధేయసచివాగ్రణి పుత్త్రుఁడు పెద్దిరాజు సం
పన్నిధి [3]పల్లికొండజనపాలుఁడు మల్లనదేవరాజుచే
వెన్నఁగఁ గుంచె లందలము వెల్లియుఁ గైకొని మంత్రియై పత్రా
పోన్నతి కెక్కె ధర్మముల నొప్పెడు బ్రహ్మవనప్రతిష్ఠలన్. ౪౬

చ. అనఘులు సింగనార్యునకు నబ్బయ గోపయమంత్రి సత్తైనా
రన యనఁ గల్గి రాత్మజులు రాములు మువ్వురు దోఁచినట్లు పెం
పున వెలయంగ నబ్బయకుఁ బుత్త్రులు పుట్టిరి రామరాజుఁ గే
సనయును బాచిరాజు గుణసాంద్రుఁడు సింగనయుం గ్రమంబునన్. ౪౭

క. ఘను లగ్రజులకు నీడై, వనములఁ గ్రీడింపుచును గృహములవశిఁ జిప్పిరి బా
చనయును సింగనయును దగి, రనఘకుమారసింగయకు మంత్రిలనన్.

క. రామాయణకృతికృతియై, [4]తామెఱయును నంధ్రకవిపితామహుఁ డనఁగా
భూమిని మించిన భీమన, నామంబునఁ బరఁగె సత్యనారన ఘనుఁడై.[5] ౪౯

ఉ. నారన కగ్రజుండు సుగుణజ్ఞుఁడు గంగనసింగమంత్రి కిం
పూరిమిసట్టి నాఁ బరఁగు గోపయమంత్రి నిజానువృత్తిఁ బెం
పారెడు నెల్లమాంబిక కులాంగనగా నుతి కెక్కెఁ దారతా
రారుచికీర్తి యోకసనరాజతనూజుఁడు దాఁ బ్రసిద్ధుఁడై. ౫౦

వ. ఇట్లు గోపరాజతనూజుండైన కసవరాజు దానగుణరాధేయుం డగు రాణా మల్లనరేంద్రునకుఁ బరమగురుండై శైవాచారప్రథమసింహాసనాధీశ్వరుండైన [6]బ్రహ్మదేవయోగీశ్వరుల కూఁతురు కామాంబిక యను కామినీరత్నంబుఁ బరిగ్రహించి సుగుణగణగణ్యుండై నెగడె. ౫౧

ఉ. స్థేయుఁడు మంత్రిలక్షణవిధేయుఁడు లాలితదానకేళి రా
ధేయుఁడు సర్వసజ్జనవిధేయుఁడు సంతతసత్యవాక్యకాం

1. చంద్రికన్. 2. గంగాంబకుఁ బుట్టిరి భువి, నంగజసన్నిభులు ఘనులు అన్నయయు సింగయ మంత్రియు, 3. పల్లికొండ గుణసంగుఁడు సింగనయుం బ్రియంబునన్, 4 రామాయణకృతి పతియై, 5. కవియై. 6. బ్రహ్మదేవనదీయులు.

తేయుఁడు నిత్యకీర్తి సుదతీపరిణేయుఁడు భావశుద్ధిగాం
గేయుఁడు గాయకప్రకరగేయుఁ డమేయుఁ డజేయుఁ డున్నతిన్. ౫౨

సీ. ప్రకటితసరసవాక్పతి యనఁగాఁ జెల్లి చతురాస్యుఁడై పద్మజన్ముఁ డనఁగ
నార్యానుకూలమహాకార్యంబు దీర్చుచు సర్వజ్ఞుఁడై మహేశ్వరుఁ డనంగఁ
గామాంబఁ దనపత్నిగా గారవించుచుఁ బురుషోత్తముండయి హరి యనంగ
గోపకుమారుండు కొడుకుగా నక్రూరదృఢమిత్రుఁడై వాసుదేవుఁ డనఁగ
వేముగల్లు జన్మభూమిగాఁ బెరిఁగియు, [1]దీవులెల్ల మాటఁ దేటపఱిచి
హరిపదైకబుద్ధి హరితగోత్రాంబుధి, రాజనంగఁ గసవరాజు మించె
క. తంత్రముచేఁ గార్యము పర, తంత్రము గాకుండఁ బతిహితమె చేయుమహా
మంత్రులలోపలఁ గసనయ, మంత్రి విచారమున దివిజమంత్రియుఁ బోలెన్.
వ. ఇట్టి మంత్రిశిరోమణికి నునికిపట్టగునట్టి పట్టనం బెట్టిదనిన. ౫౫
శా. రాణామల్లన కీర్తిచంద్రికలు పర్వం బొంగి మధ్యాశ్రిత
క్షోణీభృద్వనదుర్గమై గుణమణిస్తోమంబుల న్నిండి య[2]
శ్రీనాశ్రీపురుషోత్తమాశ్రయమునై చెల్వారి దానామృత
శ్రేణిం ద్యాగసముద్రనామము వహించె న్వేముగల్లీమహిన్. ౫౬
వ. అట్టి పురంబునందు. ౫౭
క. పూజితు లగు కవులకృపన్, భ్రాజిష్ణుఁడఁ గొంత [3]యాంధ్రభాషావిదుఁడన్
రాజనుతుఁడైన కసనయ, రాజతనూభవుఁడ గోపరాజనువాఁడన్. ౫౮
శా. చిత్రఖ్యాతి [4]వితీర్ణవిక్రమనిధి శ్రీవిక్రమాదిత్య చా
రిత్రఖ్యాపనశాసనంబులకు భూరిస్తంభసంభారమై
ధాత్రీపాలురుఁ గావ్యవేదులును మోదం బంద సింహాసన
ద్వాత్రింశత్కథల స్గునంబులుగఁ గావ్యం బొప్పఁగాఁ జెప్పెదన్. ౫౯
వ. అది యెట్టిదనిన. ౬౦

—♦ కథాప్రారంభము ♦—

ఉ. సారబలప్రసారపరిశంసితవింశతిబాహుబాహుకే
యూరచిరత్నరత్నశిఖశోభలహా రజతాద్రిపై మనో
హారవిహారము ల్సలిపి యచ్చట నచ్చట విశ్రమించుచుం
జారువిచారుఁ గింకరవశంకరు శంకరు గౌరి యిట్లనున్. ౬౧

---

1. మేటినృపులమాటగీటుపఱచి 2. యీక్షోణిక్ శ్రీపుర...శోభిల్లి. 3. యప భాషావిదుఁడఁగ 4. వికీర్ణవిక్రమ.

క. చిత్రజహార మీవలనం, గ్రొత్తకథ లెలిగె నని కోరి వినంగాఁ
జిత్తం బుత్తలపడియెని, నిత్తఱి నీ ప్రోద్భువృత్తి మెఱిఁగింపఁగదే. ౬౨

క. నావుడు దేవుం డిట్లను, దేవీ కథ లెల్ల నీకుఁ దెలిపెద మొదలన్
దేవాసురమానుషముల, నీ వెఱుఁగనియట్టికథలు నేఁ డిఁక నేవి! ౬౩

క. ఇప్పటికి భోజనకుఁ గడు, నొప్పిద మగు మణిమయాసనోపాంతములన్
ముప్పదియురెండుబొమ్మలు, చెప్పిన యాకథలు గలవు చెప్పెద వినుమా.

క. అనవుడు నామణిసింహాసన మెవ్వరిసొమ్ము భోజజనపతి కేలా
గునఁ జేరె నేమికారణ, మున నతనికి నిన్నికథలు బొమ్మలు సెప్పెన్. ౬౫

క. నాకుం జెప్పుఁడు నావుడు, నాకైలాసంబుపై సుఖాసీనుం డై
యేకతమునఁ గథ లన్నియు శ్రీకంఠుఁడు గౌరి కిట్లు చెప్పఁదొడంగెన్. ౬౬

సీ. కాంచనకుంభసంగతశృంగములు గలమేడలు గడకట్టు మేను వనఁగ
రామణీయకగుణారామంబులైన మందిరములు తీరముగఁ బురము లనఁగఁ
గట్టాయితం బైన కట్టడ గంకోటలపుట్ట యాచెలియలికట్ట యనఁగఁ
గడ గాన రాక భీకరమకరాలయం బైనయగడ్త మహాబ్ధి యనఁగ
తే.గీ. మించి భూమండలంబు నిర్మించువేళఁ, దెలివిపడ బ్రహ్మ వడియచ్చు దెచ్చుకొన్న
ద్వీప మనఁ జెల్లు బహురత్నదీప్యమాన, గోపురంబుల నుజ్జయనీపురంబు. ౬౭

క. ఏకడఁ జూచిన గన్నె, వ్యాకీర్ణము లై వెలుంగు నవ్వీటి గృహ
ప్రాకారంబుల మహిమను, జీకటి యుదు చోరకులముఁ జేఁగనఁ డమున్. ౬౮

క. కోట నొకచోట మరకత, కూటముఁ దృణ మనుచు నిలిచి గోమతులుండ్లం
గోటికి నెత్తినపడగల, యాలునకై యులికిపాటు పడ్డని హయముల్. ౬౯

ఉ. సంబరగాలిచేతుల నభస్థలి నెక్కొనఁదంచె సేసి నా
కంబు మహీతలంబుఁ గనుఁగ బ్రబియించి విరించి తొల్లి తు
ల్యంబుగ నొడ్డి దోఁ జూలుకనై యమరావతి మీఁగి కేగ న
త్యంబున నెక్కుడై యట నవంతిపురం బిటు వ్రాలెఁ గ్రిందికిన్. ౭౦

క. క్రిందయ్యును నమరావతిఁ గ్రిందుపఱుచు ననుచుఁ గవులు కీర్తింప మహీ
బృందారకవరులకు నా, నందంబుగ నయ్యవంతి యనఁగాఁ బొల్చున్. ౭౧

ఉ. జాగులు లేక యిమ్మ నెఱబాగులు, నంచితకీర్తిసంగతో
ద్యోగులుఁ, బాపవర్జనవిరాగులుఁ, గల్పితయోగులు, న్సురా
రాగులు, వీతరాగులు, నిరస్తవిరోధకృతానురాగులున్
భోగులు, నిర్విభాగులును, బుణ్యసరాగులుఁ నప్పురిజనుల్. ౭౨

గీ. మధురకంచికాశిమాయాపురము ద్వారవతియు నయోధ్యయు నవంతిపురము
నాఁగ నెగడు ముక్తినగరంబులం దున్న, నరులు పుణ్యభాజనములు గారె.

శా. వేణీలోచనలుం గవీశ్వరులుఁ బ్రత్యేకాఢ్యులున్ జాణలు
న్వీణావేణుకళాప్రవీణమతులు న్విద్వాంసులు న్వీరులున్
క్షోణీదేవతలు న్మహోత్సవముల న్సొంభిల్లఁగా నిత్యక
ల్యాణంబై చెలువొందు నాపురము దివ్యంబైన సంపత్తితోన్. ౭౪

సీ. దానప్రశస్తహస్తప్రభావము గల్గు భూవల్లభులును దంతావళములు
వివిధపదక్రమ విహితవర్తన గల్గు కుంభినీసురులును ఘోటకములు
బహుళసంఖ్యాతనిర్వహణచాతురి గల్గు నుత్తమగణకులు యోధవరులు
సక్షపాటవసంభృతార్థభావము గల్గు నాదిజాదరులును సరదములును
బదడు పసిఁడిగాఁగ భాండసంపద గల్గు, గ్రొత్తవర్తకులును గుమ్మరులును
జొప్పుదప్పకునికి నెప్పున నొప్పుల, కుప్పయనఁగఁబరఁగు నప్పురంబు.

గీ. అందుఁ జంద్రగుప్తు నాత్మజుండగు భర్తృహరియు రాజు విక్రమార్కుఁ డతని
సవతితల్లికొడుకు యువరాజు తన్మంత్రి, భట్టి నాఁగ నీతిపరుఁడు గలఁడు.

చ. అలక లలివ్రజంబు, వదనాబ్జము చంద్రుఁడు, సుస్వరంబు కో
కిలములు, మంజువాక్యములు కీరగణంబుల సొంపు, చల్లనూ
ర్పులు మలయానిలం, బయిన రూపము దాల్చి యనంగసేన నాఁ
జెలఁగె ననంగసేన యను చేడియ భర్తృహరిప్రభార్య యై. ౭౬

క. తరుణులలో మిక్కిలి నీ, తరుణికడం జిక్కి వీతధరణీవరుఁడై
యొఱపునఁ దదీయచేతో, హరుఁడై హరివోలె భర్తృహరి విహరించెన్.

ఉ. అత్యనురక్తి భర్తృహరి యంతిపురంబునఁ గేళిలోలుఁడై
నిత్యరతిప్రసంగముల నిల్వఁగ నాతని దర్శనంబు సాం
గత్యము లేకయుం బ్రజలు కార్యముపట్లను భట్టి విక్రమా
దిత్యుల సేర్పునం దగవు దీఱఁగ నుండిరి నైజవృత్తులన్. ౭౮

క. ఆదినముల నప్పురిలో, వేదవిదుం డైన యొక్కవిప్రుఁడు మిగులం
బేదఱిమి నొగిలి ధనసం, పాదనమతి భద్రకాళిపాలికిఁ జనియెన్. ౭౯

క. చని యాగుడిముందట నుం, గ్రనియతిఁ దప మాచరింపఁగా నాదిమయో
గిని మెచ్చి దివ్యరూపం, బున నిలిచె న్విప్రుతలఁపుపొం దొనగూర్పన్.

ఉ. అత్తఱిఁ జాగి మ్రొక్కుచు ధనాఢ్యత వేఁడుట దప్పి యాత్మలోఁ
దత్తఱ మంది బ్రాహ్మణుఁడు తా నమరత్వము వేఁడినం గృపా

2

యత్తమున స్తమైన జగదంబిక యేకజనోపభోగ్యమా
క్రొత్తఫలంబు దెచ్చి యిది గొమ్మని యిచ్చిన వచ్చె నాతఁడున్. ౨౨

క. వచ్చుట విని తన కెమరుగ, వచ్చినసతిఁ జూచి పిన్నపారలసేయం
బచ్చుపడ నడిగి యాపం, డిచ్చి యనుష్యత్వ మిచ్చు నిది యని చెప్పెన్.

క. అనవుడు విని యతనిరుటుం, బనియును దారిద్ర్య సాక్షిపీడిత యగుటం
దనపతిఁ గడు దూఱుచు ని, ట్లనియె మనస్తాపమున నిరాకరణముగాన్.

ఉ. అచ్చట మెచ్చు గాంచి యిట కర్థము దెచ్చెద వంచు నన్నె ను
చ్చిచ్చున నెచ్చి పొట్ట కొరక చేరెఁడు గంజియు లేక యూఁకటం
జచ్చియుఁ జావ మించుకే కేమంబయినం గొనరాక దేశదేఁ
దెచ్చితి విట్టిపండు విధి త్రిప్పఁగ భూందనబుద్ధి దప్పనే. ౨౫

క. కమపునకుఁ గూడు గానక, కడి యిడియిడి యిసుకపట్టె బడుగున కియ్యా
బడి యమరత్వం బేటికిఁ, గడు పిటఁ గాలంగఁ గంటఁ గాటుక యేలా.

క. గతి దప్పిన పనికేమని, పతి దూఱఁగవచ్చు నిట్టి ఫలమున నొక నం
గతి ధనము వడయవచ్చును, మతిలో స్త్రీ బుద్ధి యనక మన్నింపఁదగున్.

మ. ధరణీకాంతున కైన నొప్పు నమరత్వం బింక నీవేగి యా
నరనాథుం గని దీని నిచ్చి బహురత్నస్వర్ణనిర్మోజ్జ్వలాం
బరభూషాది సువస్తువు ల్వడసి రమ్మా యంచుఁ బొన్నన్న భూ
సురుఁ డేగెన్ ఫలహస్తుఁ డయ్యును *విహస్తుం డై నృపాస్థానికిన్.

శా. ఆవేళన్ రమణీమణుల్గొలువఁగా నాస్థానభూమి న్సుఖ
శ్రీ వెంపారఁగ నున్న భర్తృహరిధాత్రీనాయకుం గాంచి భూ
దేవుం డుత్సవ మంది యాదరముతో దీవించి యాపండు న
ద్భావంబొప్పఁగ నిచ్చి చెప్పె వయసం దత్ప్రాప్తి సత్ప్రేమతోన్. ౨౯

చ బహుజనరక్షకుండ వగుపార్థివ నీక తగు న్ఫలం బను
గ్రహమునఁ బుచ్చుకొ మ్మనినఁ గైకొని భూపతి ప్రేమతో యతో
న్మహిమకుఁ జేసుగాఁ బసిఁడిమాడలుఁ జీనిపట్టుచీరలు
న్సహితములైన రత్నములు మన్నన నాతని కిచ్చి పుచ్చె తాన్. ౩౦

క. నే నుండఁగ నిది నచ్చిన, నే నందుట గడిఁది యిట్టినెలఁతుక గలుగ
న్నే నున్న నొప్పు నని తన, చేనున్న ఫలం బనంగసేనకు నిచ్చెన్. ౩౧

---

* విహస్తుఁడు = చేయిలేనివాఁడు, వ్యాకులుఁడు.

సీ. ఆపొలఁతియు దాఁచి యాపండుఁ దనతోడ నూని కూడెడు మిండఁడీనికిచ్చె
వాఁడును దనుఁ గోరి వచ్చి యాపాలలోఁ గనవూన్చునట్టి బానిసకు నిచ్చె
నదియును దనకోర్కి నడిలఁబుగామున్న తనకూర్చుపసులగోపునకు నిచ్చె
వాఁడును దనకుఁ దాపలచి కొట్టములోని పెండ యెత్తెడునట్టి ముండకిచ్చె
నదియు దానిరాక మొదలెఱుంగమిఁ జేసి, పెండబుట్టిలోనఁ బండు వెట్టి
కొంచు నింటి కేగుదెంచుచోఁ దెరువున, నరుగుచుండి భూమివరుఁడుగనియె.
క. కని దానిఁ బిలిచి యిదియే, యనువున నీకుఁ జేరెఁ జెప్పు మనవుఁడు నాత
మ్మునిమఱఁది పసులఁ గావం, జని యడవిం దెచ్చె ననఁగ జనవిభుఁ డలుకన్.
గీ. తొంటివిప్రుని బిలిపించి ధూర్త నీవు, తెచ్చియిచ్చిన ఫలమని తెల్పి ధనము
గొంచు నేగితి పదిమొల్లక్రొత్తయోరి, దీని కిచ్చినదనుడు నాద్విజవరుండు.
క. నే నిచ్చినదియె యిది మఱి, కానేరదు నన్నుఁ గల్లగాఁ జేయకుమీ
రే నెపమున నిటుచేరెనొ, దీనిని శోధింపు వసుమతీవర యనినన్. ౯౫
క. ఉల్లమునఁ గనలి ధరణీవల్లభుఁడుం దానిఁ బిల్చి వనితా యిది నీ
యిల్లే విరవునఁ జేరెను, గల్లాడక చెప్పు*నిన్నుఁ గాచితి ననియెన్. ౯౬
మ. అనినం జెప్పకతీర దంచు నది నెయ్యం బొప్ప నాగోపుఁ జె
ప్పినఁ దన్మాలముసం గ్రమక్రమమునం బృథ్వీశ్వరుం డంతయు
న్వెని దండింపక యాత్మ రోసి పలికె న్వేయింపుల నొంపులం
దనియం జేసిన నిల్చునే వనితచిత్తం బంచు నిందించుచున్. ౯౭
గీ. కప్పురంపుఁగుడుటఁ గస్తూరి యెరువుతో, నుల్లి నాటి చందనోదకములఁ
బెంపిరేని దానికంపుమాయని భంగి, నెంతయైన నిలువ దింతిమనము ౯౮
క. వనిత యొరుఁజూ దిలోనగు, ననని క్కము వతియు దోడియతివలుఁబరులుం
గని విని యెగ్గొనరించెద, రని మూనిన మానుఁగాక యుడ్డముగలదే. ౯౯
సీ. మద వెక్కుచన్నులు మాంసపుముద్దలు హేమకుంభములను నెక్కు డనుచు
దూషితమూత్రపురీషదుర్గంధ మౌ జఘనంబు కరిశిరస్సదృశ మనుచు
జిలిబికిం బుపులకుఁ జీమిడికిని బుట్టయైన మొగంబు సుధాంశుఁ డనుచుఁ
గండలుఁ దోలు†బొక్కలుగూడఁ బొదపిన యాకృతిపసిఁడిసలాక యనుచుఁ
‡ దేగడైన పెదవి త్రేగు డమృతమని, కవులు వొగడఁ బేరు గలిగెఁ గాక
తత్త్వ మెఱిఁగి యిట్లు తలపోసి చూచిన, నింతి రోఁత కెల్ల నిల్లుగాదె.

* తప్పుగాచితి † డొక్కలు ‡ ఉమియు పెదవి త్రేగుడమృతంబటంచును— నేగడైన పెదవి—

చ. అనుచు బహుప్రకారముల నంగనల న్మది రోసి యాత్మకా
మినులఁ బరిత్యజించి యిఁక మీమతి కింపగువారిఁ జేసికొం
డని సెలవిచ్చి రాజ్యసుఖమంతయు మాని విరక్తచిత్తుఁడై
యనుజుని విక్రమార్కునిఁ బ్రియంబుగఁ బిల్వఁగఁ బంచి యిట్లనున్. ౧౦౧
క. మనతండ్రి సారమంత్రం, బునఁ దప మొనరింప మెచ్చి మున్నర్కుఁడు దాఁ
దనయుఁడ నై పుట్టెదఁ బొ, మ్మని నీ వై పుట్టె విక్రమార్కుం డనఁగన్. ౧౦౨
గీ. సర్వలక్షణముల సంపూర్ణుఁడవు నీవు, భట్టి మంత్రి గాఁగఁ బ్రజల నెల్ల
నేలు మంచు ముద్ర యిచ్చి దేశాంతరం, బరిగెఁ బరమయోగిచరితమునను.
క. అన్నరనాథుఁడు విడిచిన, యన్నులుమున్నూఱు నతని యనుమతి *గలుగన్
మున్నూఱుఁ జేసికొని ధర, మున్నూఱుకులం బనంగ మొనసిరి సిరులన్.
శా. రాజ్యం బేలుచు విక్రమార్కుఁ డిట సంరంభోచితోజ్జృంభణ
ప్రాజ్యప్రాభవసంభృతద్విపహయప్రారంభసైన్యంబుతో
సజ్యం బైనధనుర్బలంబు కలిమిన్ సామంతులన్ గెల్చి త
త్పూజ్యుం డై ధనధాన్యలక్ష్మిఁ బరఁగెం బుణ్యం బగణ్యంబుగన్. ౧౦౫
క. అతఁడు మహాకాళున కా, తత మగుతప మాచరించి తన కమరత్వ
స్థితి వేఁడిన నరులకు †నీ, గతిపడ దొండగు వానిఁ గడిఁదిగ మఱియున్.
క. ఒకదివసం బెక్కుడుగా, నొకయేఁ డగు పిన్నపాప యుదయించిన బా
లకుచేతఁ గాని లౌఁ జా, వక యుండను వేఁడికొనిన వర మతఁ డిచ్చెన్.
వ. ఇట్లిచ్చి. ౧౦౮
క. వెయ్యేఁడులు రాజ్యసుఖం, బయ్యెడఁ బొమ్మనిన దేవునానతి నారా
జియ్యకొని వచ్చి భట్టికి, నయ్యానతి క్రమముఁ జెప్ప నతఁడును మఱియున్.
క. నే మఱియును నొకవేయేం, డ్లీమహి యేలంగ నీకు నిచ్చెద నని భీ
తామార్గి వగుచు రాజ్య, ‡వ్యామోహం బర్ధవర్ష మడఁచుము చాలున్.
గీ. ఆఱునెలలు నగరియందు నిల్వుము మీఁది, యాఱునెలలు యోగివై చరింపు
పురిసహస్రవర్షములు చెల్లఁ బొన్నూఱేళ్లు, నున్నవేయుఁ జెల్లుచుండు ననియె.
క. తద్వచనము నిజహితముగ, హృద్వనజములోఁ దలంచి యిల యెల్ల నుపా
యద్వయమున నరయుచు భూ, భృద్వల్లభుఁ డేలెఁ బ్రజలు ప్రియమందంగన్.
వ. అంతనొక్కనాఁడు ౧౧౩

---

* మిగులన్. † నిదిగతిపడదు. ‡ వ్యామోహం బదియూ నర్ధవర్షము చాలున్

సీ. ఒకజోగి యతనిఁ గాటికిఁ దోడుకొనిచని బేతాళురప్పించి ప్రీతినునిచి
వేలిమిచేసి తా విపరీతగతిఁ బొందె బేతాళుఁ డారాజుపెంపు మెచ్చి
యొడ్డరైనఁ దలఁపుమీ యే వచ్చి పనులెల్లఁ జేసెద మఱి యష్టసిద్ధులొందు
దనిపోయె బ్రహ్మాదులును మీఁద విద్యాధరాధిపత్యం బగు ననుచుఁ జనిరి
భూవిభుండు మగుడఁ బురమున కేతెంచి, సప్తసంతతులను సత్త్రములను
సంతతాధ్వరములఁ గొంతేయుగతి శక, కర్తయై ధరిత్రిఁ గీర్తినెఱపె. *

ఉ. సజ్జితదానధర్మగుణచారువిచారుఁడు వైరిదారదృ
క్కజ్జలమార్జనప్రథమకారణచారుకృపాణపాణి వి
ద్వజ్జనబృందవందిజనతాజలజార్కుఁడు విక్రమార్కుఁ డా
యుజ్జయినీపురంబున నయోన్నతి రాజ్యముసేయుచుండఁగన్. ౧౧౪

వ. తొల్లింటి కాలంబున. ౧౧౫

క. విశ్వామిత్రుఁడు తప మతి, శాశ్వతముగఁ జేయ నెఱిఁగి శంకించి యమ
ర్త్యేశ్వరుఁడుకొలువులోఁదన, విశ్వాసము† గలుగునట్టి వెలఁదులకనియెన్.

క. ఓయూర్వశి యోరంభా, మీయిద్దఱలోన నొక్క మెలఁతుక సటనో
పాయంబునఁ జిక్కిడి ముని, సేయుతపంబునకుఁ గీడు సేయఁగవలయున్.

చ. అన విని పాత్ర నీయెనుర నాడిన నిద్దఱిలోన దీనిచేఁ
బని యగు నంచు నీ వెఱిఁగి పంపుము నావుడు నట్లకాకతెం
డనవుడు వాఁడు రంభ తగ నాడినఁ జూచి ప్రహృష్టచిత్తుఁ డై
యొనర ననుక్రమంబునను నూర్వశి యాడిన నట్ల మెచ్చుచున్. ౧౧౯

క. వారల యొక్కువతక్కువ, లేరీతుల నెఱుఁగ లేక యింద్రుం డిఁక నె
వ్వారెఱుఁగుదురో యని బృం, దారకమునివరుల నడుగఁ దత్సభలోనన్.

క. సారదయామృతమతి యగు, శారదకృప వడసి యతివిశారదుఁ డగునా ‡
నారదుఁ డుపమితశారద, నీరదుఁ డావిక్రమార్కనృపతిం జెప్పెన్.

ఉ. అర్కనిమూర్తి సర్వకళలందుఁ బ్రవీణుఁడు సంగరస్థలిం
గర్కశరాజలోకలయకాలుఁడు దానవినోది పావసం
పర్క విదూరుఁ డార్తపరిపాలనశీలనశాలి విక్రమో
దర్కుఁడు విక్రమార్కుఁ డిట కాతనిఁ బిల్వఁగఁ బంపు నావుడున్. ౧౨౨

మ. మునివాక్యంబున నింద్రుఁ డిట్టిగుణధాము న్విక్రమాదిత్యుఁ దో
డ్కొని రమ్మా యని పంపె మాతలి నతండుం దేవసం బాగప §

* గీర్తినిలిపె. † విశ్వసనము ‡ దయ్యెన్. § వేయుపచ్చని-

చ్చని గుఱ్ఱంబులం బూన్చి కొంచు నధికోత్సాహంబుతో మింటిపైఁ
జని యుజ్జైనికి డిగ్గి యచ్చట నృపాస్థానంబు వీక్షించుచున్. ౧౨౩

మహాస్రగ్ధర-
సభలోనం గాంచె వర్ణాశ్రమజనపరిరక్షావిహారంభలీలా
శుభనిత్యాచార లోకస్తుతవిశదనిజస్ఫూర్తి సత్కీర్తిలక్ష్మీ
విభవాకృష్టార్థిజాతాభినుతతరగుణాన్వితహస్త ప్రభావ
ప్రభవ శ్రీరమ్యు ఖడ్గప్రకటితజయసంపన్ను నవ్విక్రమార్కున్. ౧౨౪

మ. కని యింద్రుం డిదె నిన్నుఁ బిల్వఁబనిచెన్ క్ష్మాపాల విచ్చేయుమా
యనిన న్గొబ్బున లేచి మాతలికి నాహ్లాదంబుగా నాదరం
బొనరం జేసి మహోత్సుకత్వమున నాయుర్వీశుఁడుం గాముఁడో
యన వచ్చెన్ హరితాశ్వరత్నయుతదివ్యస్యందనారూఢుఁడై. ౧౨౫

వ. వచ్చి కామధేను కల్పతరు చింతామణీ సంతతనివాసంబై యమరు నమ
రావతీపురంబు సొచ్చి తేరు డిగ్గి మాతలియునుం దోడరా నమరకిన్నరవి
ద్యాధరయక్షరక్షోనికరపరివారుండును దిక్పాలముకుట తటఘటిత మణిగ
ణకిరణారుణిత చరణకమలుండును నప్సరోహస్తచామీకరదండచారు చా
మరవ్యజనవీజ్యమానుండును నై సుధర్మాసభామధ్యంబునం దారకితతారా
పథమధ్యభాగంబునం దారాగణపరివృతుండై వెలుఁగు చంద్రునిచందంబు
న నందం బగు బృందారకేంద్రునిం గని ప్రణమిల్లిన నతనిం గౌఁగిలించు
కొని గారవించి దీవించి యాసన్నమణిమయసింహాసనంబుపై సుఖాసీనుం
జేసి కుశలం బడిగి సురపతి నరపతి కిట్లనియె. ౧౨౬

గీ ఊర్వశియు రంభయును నాకఁగా మాకుఁ, దారతమ్య మెఱుఁగఁ దరముగాదు
సర్వకళలయందు జాణవు నీవంద్రు, దీని నిర్ణయింపు మానవేంద్ర ౧౨౭

గీ. అనుచుఁ బలికి సుత్రీయు సాంగసంగీతవా, ద్యాదికృత్యములకు ననుప మెఱయఁ
గడఁగి నిలుపుఁ డనుచు గంధర్వులకుఁ జెప్పి, మున్ను రంభ నాట్య మున్నయంత.

శా. గంధర్వుల్ పను నాల్గు దోషములు దక్కం దాళమానంబులన్
గాంధర్వంబు ధ్రువా ప్రబంధసరణిన్* గావింపఁగా వాద్యముల్
ధింధింధిక్కధిమిక్కతక్క ధికతోంధిక్కత్తకోఝుంకిణిం
ధింధాంఝుంకకుఝుక్కుధిగ్ధిగుడధాధీయంచు మ్రోసెన్వెసన్. ౧౨౮

* ధ్రువాదిబంధసరణిం-

క. జంభారియెదుర నాట్యా, రంభమ్మున నూర్వశీపరాజయకృత సం
రంభయు నూరుద్వయజిత, రంభయునై రంభ నిలిచె రంగస్థలిపై. ౧౩౦

క. సురకతిపంపునఁ గూడిన, మురజధ్వను లభ్రశబ్దములుగా శృంగా
రరసము గురియఁగ నాడెను, దిరుపుల మురిపముల మెఱపుఁదీగయుఁబోలెన్.

వ. ఇట్లు రంభ యాడినం జూచి సూనాకలోకభూలోకనాయకులు మఱి వాఁ
డూర్వశి కవసరం బిచ్చిన నదియును సంగీతశాస్త్రానుసారంబుగా* నిలిచి
విలక్షించుచు—

క. తనువున గీతాలంబన, మును జేతులనర్థవ్యపితమును నేత్రయుగం
బున భావముఁ బదములఁ దా, ళనిర్ణయమ్మును మెఱయఁగలాస్యము నెఱపెన్.

క. సురకామిని తననయనము, లరుదుగఁ దలచుట్టివచ్చు ననుట నిజముగాఁ
దిరుగుచుఁ బరిమండలితాం, బరపల్లవయైనటించె మసగొడుగుక్రియన్.

క. ఈక్రియ నూర్వశి యాడిన, విక్రమునునుఁ జిదియె మఱియు నెరవరియనినన్
శక్రుఁడు మర్మముదెలుపుము, యేక్రమమున దీని నిర్ణయించితి వనినన్.

ఉ. నావుడు నాతఁ డిద్దఱును నాట్యమున న్సరివత్తు రిందు శా
స్త్రావగతప్రసంగముల సాంగముగా నిది యాడె గాన ని
ట్లే వివరించి యూర్వశియ మెచ్చుడుగాఁ గయికొంటి నన్న న
ద్దేవ్రఁడు మెచ్చి యాతనికి దివ్యవిభూషణ మిచ్చి పెంచియున్. ౧౩౬

సీ. ప్రభల నుప్పొంగు ముప్పదిరెండుబొమ్మలు నన్ని వాకిళ్లఁ బొంపడరుచున్న
నవరత్నఖచితమై వివిధసోపానమై భాసురంబైనసింహాసనంబు
మెచ్చుగా నిచ్చిన మెయికొని ప్రణమిల్లి దేవేంద్రు వీడ్కొని తేరిమీఁద
నిడికొని యుజ్జైని కేతెంచి పీఠ సింహాసనంబెక్కి యాయవనివిభుఁడు†
సిద్ధులెనిమిదియును జేకూరఁ బగతుర, పే రడంచి యాజ్ఞ పెంపుమీఱ
నేకవీరుఁడై యనేకవర్షంబులు, ధరణి యేలెఁ బుణ్యచరితుఁ డగుచు. ౧౩౭

శా. సత్పాత్రప్రతిపాదితార్థుఁ డయి రాజ్యం బుర్విలో సర్వసం
పత్పూర్ణంబుగఁ జేయుచుం బ్రజల భూపాలుండు పాలింపఁగాఁ
దత్పూర్వార్జితపుణ్యభోగముల కుత్సాన్యత్వసంపాదులై
యుత్పాతంబులు పుట్టె నుజ్జయినిలో నుల్కాదిలక్ష్యంబులై. ౧౩౮

---

* సంగీతప్రసంగానుసారంబుగా. † నిడికొని యుజ్జయినికిఁ దెచ్చి యొకవేళ సమ్మహా
సనమెక్కి యవనివిభుఁడు.

క. అట్టివి గని జనపాలుఁడు, భట్టిం బిలిపించి నీవు భావజ్ఞుఁడ వీ
పట్టున నేతెఱఁ గగునో, యట్టి తెఱంగెఱుఁగు మనిన నతఁ డి ట్లనియెన్.

గీ. పడగ నేలఁ గూలెఁ బట్టమేనుఁగు వ్రాలె, మేడఁ గాకికదుపు గూడి యఱచె
నిన్న వారువముల కన్నుల నీరొల్కె, దీన నీకుఁ గీడు దెల్ల మింక. ౧౪౦

క. ఇది నిజ మనవుడు నతఁ డే,కదినాధికవర్షమైన కన్యకు సుతుఁ డై
ట్లుదయించు నాకుఁ గీడౌ, ట్లాదవు నదిలోన బెగడకుండుము *భట్టీ. ౧౪౧

క. జమునికి నెరగోసెద † నా, క్రమమెఱుఁగ వెయనుడు నతఁడు కమలజఘటనా
సమయం బైన నసంభా,వ్యము లైనను సంభవించు నది మొ ట్లనినన్. ౧౪౨

క. ఇది మానిసి యిది సింగం, బిది దేవత యను వివేక మెడలఁగ బలసం
పద నుక్కుఁగంబమున హరి, యుదయింపఁడె దైత్యవరుని నుక్కడఁగింపన్.

క. ఏకద్విత్రిచతుఃపం,చాకృతికృతసంఖ్యముఖుల కవి జేయుండై
కైకొనిన తారకాసురుఁ, బోకార్పఁగ షణ్ముఖుండు పుట్టుట వినవే. ౧౪౪

మ. వరపుత్రుం డమరేంద్రవైరి పరిఖ ల్వారాశి యాలంక దా
గిరిదుర్గం బసురు ల్బలంబులు దశగ్రీవుండు రా జిట్లు బం
ధురమౌ రాజ్యము తాలు దేలగిల మిత్రు ల్భృత్యులం గూడఁగా
నరులు న్వానరులుం గొనం దలఁచి చన్నం జేటు వాటిల్లదే. ౧౪౫

ఉ. కావున నిట్టి బాలకుఁడు గల్గుట తథ్యము నీకు నిస్తులా
వేవులవారిచేతఁ బృథివీస్థలిలో నరయింపుమన్నఁ దా
నావచనంబు లియ్యకొని యాత్మహితుం దలపోసి విక్రమా
ర్కావనివల్లభుండు నెడ రంచుఁ దలంచెఁ బిశాచముఖ్యునిన్. ౧౪౬

క. అతలఁపున వచ్చిన నతఁ, డాతెఱఁ గెఱిఁగించి యరయు మనిపిన పిదపన్
బేతాళుఁడు పాతాళము, భూతలమును నరసి వచ్చి భూపతితోడన్. ౧౪౭

సీ. జననాథ నీవు పంచిన నెల్లచోటులుఁ దిరిగి ప్రతిష్ఠానపురములోనఁ
గుమ్మరి యింట శేఁగొన్నముండట మట్టిబలములతో నాడెడు బాలుఁ జూచి
యెవ్వరివాఁ డను నెడ నొక్క విప్రుండు తనకూఁతుకొడుకు తజ్జనని యిద్ది
యేఁటిపై నొకదినం బేగుచో ‡ నాగేంద్రుఁడీ పాపఁ గూడిన § నితఁడు పుట్టె
దీనికారణంబు దేవరగాక యెఱుం, గెవ్వఁ డెఱుఁగు ననుచు నిట్లు పలికె
నింక రాజ్యభోగ మింక కుండఁగ నీవు, సాహసంబు సేయు సాహసాంక.

---

* బెదరకుండుము. † నొరగోసెద. ‡ చేగిన. § గోరిన.

మ. అని చెప్ప న్విని యావలం దెలిసి సువ్యక్తంబుగా నాత్మనా
శనమూలం బని నిశ్చయించుకొని యాశ్చర్యంబుగాఁ దొల్లి చే
సినకార్యంబులఁ దోఁడు వేఁడక మదిం జేడ్పాటులుం దోఁడువేఁ
డినఁ గష్టం బగు నంచు దాఁ జనియె భట్టి న్నిల్పి తా నొక్కఁడున్. ౧౪౯

ఉ. ఆనరనాథుఁ డిట్లు చని యాయుధ మొక్కటి తోడుగాఁ బ్రతి
ష్ఠానపురంబు డగ్గఱునెడం జతురంగబలంబు లన్నియు
న్వానిపిఱుంద సేగి నలువంకల నిల్వఁగ నందుఁ గొంద ఱా
లోనికిఁ జొచ్చి యావిజయలోలుని బాలునిఁ బోరఁ బిల్చినన్.* ౧౫౦

క. నాగేంద్రుఁడు జీవనవి, ద్యాగుణ మగుమంత్రశక్తిఁ దత్కృతములు నా
నాగాశ్వరథభటాదుల, కాగతిఁ బ్రాణంబు లిచ్చి యాత్మజుఁ బంపెన్. ౧౫౧

గీ. ఆకుమారుఁడు శాలివాహనుఁ డనంగ, నెగడి నగరంబు వెలువడి నిలుచునంత
శేషుపంపున వచ్చి యాశీవిషములు, విక్రమార్కునిమూఁకలనాక్రమించె౧౫౨

ఉ. సర్పము లిట్టియ న్భటులఁ జంపిన నాతఁడు వారిప్రాణము
ల్గూర్పఁ దలంచి వాసుకికి ఘోరతపం బొనరించి యయ్యెడన్
నేర్పొకయింతలేక యది నిష్ఫలమైనఁ గలంగియు న్భుజా
దర్పము గోడుగాఁగ నిది దైవవశం బని వచ్చెఁ బోరికిన్. ౧౫౩

క. అతఁ డిటు వచ్చినఁ దక్కిన, హితులును సైన్యములు గూడ నేతెంచినఁ ద
చ్చతురంగబలముపైఁబడ, గుతిలము పదహతుల నతలకుతలంబయ్యెన్. ౧౫౪

వ. ఇట్లు తేజోవిక్రమార్కుం డగువిక్రమార్కునిసేనలు శేషప్రసాదవిశేషశాలివా
హనుం డగుశాలివాహను† బలంబులుం దలపడి పోరునవసరంబున. ౧౫౫

సీ. కాలుబలంబులు గ్రాహసంగతిఁ గ్రాలఁ దురగము ల్తరఁగలకరణిఁ జెలఁగఁ
దేరులు కలముల తెఱఁగునఁ దిరుగంగ గరులు మైనాకాదిగిరులఁ బోల
నరిగబిళ్ళలు కమఠాకృతి మెఱయంగ నడిదంబులును మీల ననుకరింపఁ
జామరంబులు సితచ్ఛత్రంబులును శంఖ ఫేనసాదృశ్యంబు పేర్మి‡ మెఱయఁ
బడగ లుత్పతత్ఫణికులభాతి వెలయ, రుధిరధారలు విద్రుమరుచిఁ దనర్పఁ
బటహారవము జలఘోషభంగిఁ బొంగ, ముద్రమీఱినరౌద్రసముద్ర మొప్పె.

ఉ అత్తఱి పేరు తేర్చుక్రియ నార్చుచు వత్తురు వచ్చి మూఁకలోఁ
జొత్తురు చొచ్చి శత్రువులచొప్పు లడంతురు వాఁడిబీరము

---

* బిల్వఁగన్. † శాలిభానుండగు శాలివాహను ‡ సాదృశ్యంబుబెరయ

త్రెత్తుకు మెచ్చి మూర్కొనుచు మెల్పున గెల్పున భిన్నభిన్నమై
చత్తురు చచ్చి యచ్చరల సన్నిధి నిల్తురు కల్తు రందఱున్* ౧౪౮

క. అయ్యెడఁ దెగియెడువీరుల, నెయ్యమ్మున వరించు వేల్పునెలంతలు దమలోఁ
గయ్యం బడువఁగ శూరుల, కయ్యము దివిఁ జూచి నాఁడుగయ్యంబయ్యెన్.

సీ. మొగ్గైన గజఘటంబుల నుబ్బితేటైన రక్తంబు మద్యపూరంబు గాఁగ
వారక తెగినట్టి వీరులపునుకలు కొమరారు పానపాత్రములు గాఁగ
నందందు వాచవికంబున లగునుండెకాయ లన్నియు నూరుఁగాయలుగను†
గండలు తక్కిన కజ్జాలుగాఁ గూర్చి డాకినీగణము లనేకవిధులఁ
బొట్టకొలఁదిగఁ ద్రావుచుభూతములకుఁ, జవులుసూపుచు నేఁటియుత్సవముఁజోల
నొందు లే దని పొగడుచు నుల్లసిల్లి, సోలి యూడంగఁ జొచ్చె నచ్చోటఁ గలయ

క. ఆవేళఁ జిత్రముల వీ, రావేశము పొదలఁ బోరుచుండఁగ దమమున్
దైవసహాయము లేమిని, భూవల్లభుసేన లెల్లఁ బొలియుచుఁ జొచ్చెన్. ౧౫౦.

గీ. రథము లంత వితథరథికసారథులయ్యె గుఱ్ఱములును బోటిగొట్టె లయ్యెఁ
గాలుబలము లప్పుడు కాలుబలము లయ్యె, గజములెల్లఁ బోరు నజములయ్యె.

క. కాలము చేరినవానికి, నేలయుఁ బగ యగుఁగ మింట నిలిచినబలముల్
బాలునిఁ గూడక యాభూ, పాలునిసైన్యముల నేలపాలుగఁ జేసెన్. ౧౫౧

శా. శుండాలాదిబలంబు లిట్లగిసినన్ క్షోణీశ్వరుం డొక్కఁడుం
జండీభూతుండును గాలకర్మము నిషేధ్యం బ్రోవలేఁ డంచు నను
ద్దండాస్త్రుండయి శాలివాహనునిచేతన్ దండకాష్ఠాహతిన్
ఖండీభూతశిరస్కుఁడై యొరగి స్వర్గం బెల్లె నుద్వేగిలోన్. ౧౫౨

క. ఆతనిదేహము వెలువడి, యాతత మగుదీప్తి నంబరాంతంబునను
ద్యోతించుచు నెగసి మహాజ్యోతీరూపంబు సోయి సూర్యుఁ గలసెన్ ౧౫౩

గీ. ఇట్లు విక్రమార్కుఁ డీల్గి విజయుఁడై, శాలివాహనుండు లీలఁ గూడఁ
బౌరులెల్లఁ బొగడఁ బ్రతిష్ఠానమున‡ నుండి, రాజసంగఁ జేసె రాజ్య మచట ౧౫౪

సీ. అటనుజ్జయినిలోన నంగనలు పౌరులు నడలఁగా భూపాలు నగ్నిముఖమ
యోధునకన్నకన్నె జీఁగి మంత్రులు వచ్చి నీవు గర్భిణి వాటఁ బోవఁ దగదు
వలదన్న నాప్రధానని మంత్రివరుల సంబోధించి యూరు రాజ్యమును భూమియు
నీతగవును జెల్లె నిత్తటిఁ గనుపులో పాపని బుచ్చి మీపాల నిడుదుఁ

* గెల్తురద్ధతిన్ † గాయలనుచు. ‡ ప్రతిష్ఠానమునన్=ప్రతిష్ఠానపురములో

గొనుఁడనుచు శిరపత్ని గావునఁగడంకఁ, బొట్టవచ్చియుశిశువును బుచ్చియిచ్చి
యగ్నినివసించిదివికేగియమరసతులు, గొలువవలరెడునిజనాథుఁగూడుకొనియె.

క. ఆపట్టణమున మంత్రులు, నాపాపను బెంచుకొనుచు నాతని రాజ్య
శ్రీపతిఁగా నొనరించిరి, భూపాలన మాత్మబుద్ధిఁ బురికొనుచుండన్.* ౧౬౭

క. ఇలలోఁ దండ్రిబలంబును, జలమును మెఱయించుకొని ప్రశాంతుఁ డనంగా
వెలయుచు నతఁడొకకొలఁదిని, జెలువందెనుమడఁగుపట్టుచెలమయ్యుబోలెన్

చ. అనువుగ మంత్రు లాతని మహాసనసంస్థితుఁ జేయఁబూనినం
గని యశరీరి యిూపడుచుఁగార్యము లేటికి వీఁడు దీని నె
క్కిన నగుఁబాటు గాదె తెలఁగించి మహీస్థలిఁ బాఁతిపుచ్చుఁడా
యనిన నమాత్యు లెల్ల వెఱఁగందుచు నమ్మణిభద్రపీఠమున్. ౧౬౯

ఆ. పుణ్యభూమిఁ బాఁతి పుట్టగాఁ గట్టించి, కొంతకాల మున్న యంతలోన
దైవవశముకొలఁదిఁ దద్దేశ మెల్లను, హానిఁ బొందుచుఖిలమయ్యె† మిగుల.

సీ. అచ్చోట నొకవిప్రుఁ డగిసెలు లంకలు గోదుమల్ జొన్నలుఁ గొరె పెట్టి‡
పిట్టల నార్చ నాపుట్టపట్టున మంచె గావించి యది యెక్కి త్రోవవారి
సాచేనుఁజొచ్చి తిన్నన్నిజొన్నలు గోదుమలు పిసికిళ్ళుగ నలఁచి తినుఁడు[1]
అని పిల్వ నమ్మి వచ్చినివారికి కవి వెట్టఁ దా దిగి వచ్చి యందఱ నదల్చి

గీ. పసులసొమ్ములకి ట్లాసపడఁగఁ దగునె యనుచు వారల వెడలంగనడచి తిరుగ
మంచె యెక్కి-రాజసమున మరలఁబిలుచు, వచ్చిరేపయుదిగివచ్చివారిఁద్రోలు

క. ఇవ్విధమునఁ జని మగుడుచు, నవ్విప్రుని వెఱ్ఱి యనుచు నందఱుఁ దములో
[2]నవ్వుచుఁ గనుకనిఁ బోవఁగ, నవ్వార్త యెఱింగి భోజుఁడట కరుదెంచెన్

క వచ్చినన్నృపు భటులం గని, యచ్చటఁ దనమంచె నున్నయాతఁడు చేలో
మెచ్చియునవి భక్షింపుఁడు, విచ్చలవిడి విడియుఁ డనిన విడిసిరి వారల్. ౧౭౩

ఉ. తొల్లిటియ ట్లతంపు డిగి దూఱుచు భోజునిఁ జేరి యక్కటా
యిల్లొక సర్పమై తినిన నిష్ఠుఁడు వైరికి సత్తు విచ్చినం
దల్లి విషంబు వెట్టినను దండ్రి తనూజుల తమ్మిన నృహీ
వల్లభుఁ డొల్చుకొన్న మఱి వారల కెవ్వరు దిక్కు భూవరా! ౧౭౪

*భూపాలుఁడు వాత్మబుద్ధిఁ బురికొనుచుండన్ † లయమయ్యె. (హానిఁబొంది మయిల మయ్యె నని చిన్నయసూరిగారిపాఠము) ‡ విత్తి 1. తిన్ననిజొన్నగోదుమల్ పిసికిళ్ళ నుమలు నుం బిసికికొనఁడు. 2. నవ్విధ మెఱుఁగక పోవఁగ.

*గలిగి నల్లడ నాల్గుచేతుల వెడల్పు, చాపమాత్రసమున్నతి నేర్పుమిగుల
విక్రమాదిత్యు లక్ష్మీనివేశకాంతి, నంతఁ గనుపట్టె దివ్యసింహాసనంబు ౧౮౩

క. తద్రూపముఁగని నృపుఁడు ద, రిద్రుఁడు ధనరాశి గన్నరీతిం బ్రమదో†
న్నిద్రితుఁడై తివిపింపఁగ, భద్రాసన మద్రిభంగి బరువై తోఁచెన్. ౧౮౪

వ. తత్కారణం బెఱింగి మంత్రి యిట్లనియె. ౧౮౫

క. అనఘ పురూరవ నహుష య, యాతి నృగ మాంధాతృ భరత భగీరథ శిబి సా
గర రంతిదేవ రాఘవ, మరుద్దిలీప శశిబిందు మాంధాత లిలన్. ౧౮౬

గీ. వారిలోన నెట్టివారిసొమ్మో యిది, పెద్దగాలమయ్యెఁ బృథివి నణఁగి
దీని వెడలఁ దివియఁ బూనినయప్పుడు, భూతతృప్తి వలయు భూతలేంద్ర ౧౮౭

క. అనవుడు విభుఁ డది చేయుమ, మని గోటియులఁ జెఱుపు వెట్టి‡ యనుపగు బలిభో
జనముల నసురులు సురలును, దనియంగా భూతతృప్తి తగ నొనరించెన్ ౧౮౮

గీ. దీనఁ బొంగి భటులు దివ్యసింహాసనం, బెగయనీడ్వఁ దాన యెగసి వచ్చె
మంత్రిఁ జూచి రాజు మంత్రీంద్ర నీబుద్ధి, లావుకలిమి నిట్టిలాభ మయ్యె ౧౮౯

ఉ. మంత్రము లేనిసంధ్యయును, మానము లేనితపంబు వేదవి
త్తంత్రము లేని యాగముఁ బదజ్ఞత [1] లేని కవిత్వము న్సదా
తంత్రులు లేని వీణయును దానకరాగము లేని గీతమున్
మంత్రులు లేనిరాజ్యము సమానము లిన్నియు వ్యర్థకార్యముల్. ౧౯౦

వ. అని కొనియాడిన నది మంత్రిప్రశంసావసరం బని యమ్మంత్రివరుండు స్వార్థం
బును యథార్థంబునుగా నిట్లనియె. ౧౯౧

సీ. జూదరి సత్యంబుఁ జోరుని ధర్మంబు నరసుని కోపంబు సవతిపొత్తుఁ
బాషండు మతమును బ్రాహ్మణు కలహంబుఁ దులువసంగడమును ఖలుని తపముఁ [2]
గులటలభక్తియుఁ గోమటి నిజమును బణ్యాంగనల ప్రేమ పంద బిరుదుఁ
బగతుర నైరణ యెగచు వైరాగ్యంబుఁ బేవపెద్దఱికము వాదిధనము
నధమసంశ్రయంబు నైంద్రజాలికమును, బొమ్మసొమ్ము [3] మునుఁగ కొమ్మపట్టు
మంత్రిలేని రాజ్యమహిమయు నా వేళ, నుస్థిరములు పిదప నస్థిరములు ౧౯౨

గీ. [4] మంత్రశక్తి నాత్మ మఱి పెట్టిగా నుగ్ర, దండవిషమడంచి దండి గలిగి
యర్థ మొదవ భూపుఁ డను పాముఁ బట్టి యా, డించు మంత్రి గారడీని కరణి,

* కలిగి నలుదిక్కు లన్ని చేతుల వెడల్పు. † నతిమోదద్రష్టుఁడై ‡ జెఱు (రు) పువెట్టి-చెరపువెట్టి-
చెరపు = బలి-అని చిన్నయసూరి) 1 బుధజ్ఞత. 2. తగవు. 3. గొడ్డుసొంపు. 4 మంత్రశక్తిచేతన్న
మరవక పామును, మాంత్రికుండు త్రిప్పునట్లు నెప్పుడు అను వెఱింగి భూపుఁడను పాముఁబట్టి,

క. కనియుం గానక యిచ్చలఁ, జనఁజూచినఁ బోవనీక జనపతిఁ గరిచా
ద్భునఁ బట్టి యంకుశముగా, ననువగు పనిఁ ద్రిప్పుమంత్రి యాధోరణుఁడై.

గీ. కానఁ ద్రోవఁ గర్తగావునఁ దనమాట, త్రోవ నలవిగాదు త్రోవ యెఱిఁగి
యాడు మంత్రిమాట లాదరించెడివాఁడె, మేదినీశుఁడండ్రు వేదవిదులు ౧౯౬

మ. నరనాథుండు సమస్తమైనజనుల "రాజ్ఞాంప్రజాపాలనం
పరమోధర్మ" యనంగ నీపలుకుల న్భావజ్ఞుఁడై యేలఁగా
నరులం దెవ్వరు నాజ్ఞమీఱఁ జనం దన్యాయప్రవృత్తిక్రియా
పరుఁడై ధర్మముఁ దప్పఁ జేయుపనిఁ ద్రిప్పంజెల్లుఁ దన్మంత్రికిన్ ౧౯౭

క. జననాథుఁ డనపరాధిం, దునుమఁగ సెలవిచ్చి హితుల దొరల మనవుల*
న్వినకుండినఁ దన్మంత్రికిఁ, దనసేర్పున నతనికీడుఁ దప్పింపఁ దగున్. ౧౯౮

క. ఈచందంబున మంత్రి మ, హాచతురుం డొకఁడు విభునియానతి మొదలం
ద్రోచియుఁ ద్రోవకవిప్రునిఁ, గాచె ననఁగఁ దొల్లి యొక్క కథగల దధిపా ౧౯౯

క. అనవుఁడు నాకథ నాకు, న్వినవలయును మంత్రివరుఁడు విప్రుని నేలా
గునఁగాఁచెఁ బతిహితంబగు, పనిఁ జేసెం జెప్పు మనినఁ బతి కిట్లనియెన్ ౨౦౦

క. †శాలిమయాన్నసదంబర, శాలిప్రియసత్యసంగ శాలీనవసూ
శాలావిశాలశీలవి, శాలాపుర మేలు నందజనపతి కడఁకన్ ౨౦౧

క. అతనికి నతిహితుఁడు బహు, శ్రుతుఁడనఁగాఁగలఁడు మంత్రిసురమంత్రిసముం
డతఁడు ఘననీతిఁ బరఁగెను, బతికార్యధురంధరుండు ప్రజలకు హితుఁడై.

క. ఆనందభూపతికి సతి, యానందము రూపమయ్యె ననఁ గలిగెఁ ద్రిలో
కీనయనచకోరములకు, భానుమతీదేవి యమృతభానుద్యుతియై ౨౦౩

సీ. దీపితకనకసందేహంబు దేహంబు పచ్చకర్పూరంబుపలుకు పలుకు
పల్లవసంపదాస్పదములు పదములు శోభితావర్తసనాభి నాభి
కుంఠితకలకంఠకంఠంబు ముకురవిడంబిముఖము ముఖము
సరసిజవైభవాకరములు కరములు విజితనీలోరగవేణి వేణి
నడుము లేమికి నెప్పుడు నట్టనడుము, లోచనములు కర్ణాంతరాలోచనములు
ఇంతిపాలిండ్లు కంతుపాలిండ్లు గూడ, నట్టిరూపంపు రూపింప నరుదుగాదె.

ఆ. అట్టిసతిని తెప్పవెట్టక చూచుచు, నిద్ర యాఁకలియును నీరు వట్టు
నడఁచి యధరసీధు‡సమ్మృతంబుగ్రోలుచు, దేవుఁడనఁగ మనుజదేవుఁ డొప్పె.

* తగవులన్. † శాలీమయాన్న సదమల, శాలిప్రమదాన్యసం — ‡ మధురరేఖ.

క. వనితలకు నురము నోరును, దను వర్ధము నిచ్చి రచ్యుతబ్రహ్మశివుల్
ఘనుఁ డామువ్వుర మీఱుచు, జనపతి దనసతికి నిచ్చె సర్వాంగములున్.

సీ. ఆవనీశుఁ డీక్రియ నంతఃపురంబున విహరించుచును మంత్రి విన్నపమున
బలిమిమై నొకనాఁడు కొలువున కేతెంచి యాసతితొడమీఁద నభిముఖముగ
నిడుకొని తన్ముఖం బీక్షించుచుండఁగా దొరలును భటులును బరులుహితులు
లజ్జాభయములఁ దల ల్వాంచికొనియుండఁ గొంతతడవున కయ్యింతి చెయ్యి
వూని పట్టుకొనుచు లోనికిఁ బోయిన, మంత్రి కలఁగి యిట్టిమమత నేడు
మానిపింపకున్న హాని యౌనంచు మో, మోట మాని తోడ నొయ్య నేగి.

గీ. దేవ యిచట నెట్టి తెఱఁగైన నొప్పు నీ, యతివ నటకుఁ దెచ్చు టనుచితంబు
అనుడు నృపుఁడు నవ్వి యచ్చటి కే వచ్చి, యున్న నేమి రాక యున్న నేమి.

క. విశ్రుతనీతివివేక బహుశ్రుత నీయట్టి సచివుఁ* డుండఁగఁ బ్రమదో
న్మిశ్రముగ విశ్రమించెద, నాశ్రితసంరక్ష నీనయంబున జరుగున్. ౨౦౯

క. ఏణేక్షణ యీసతి నాప్రాణేశ్వరి నిమిష మైనఁ బాసిన విగత
ప్రాణమయి మేను నిల్వదు, ప్రాణము వెడఁబాయునట్టి రాజ్యం బేలా. ౨౧౦

చ. అనిన బహుశ్రుతుండు హృదయంబున నవ్వుచు నింతప్రేమ గ
ల్గినఁ బట మధ్యమంబున లిఖించిన యీసతిరూపు నీమహా
సనము సమీప భాగమునఁ జక్కటి నిల్పిన నందు నీదు దృ
ష్టి నిలుపుకొంచుఁ గొల్వున వసింపుము నావుడు నియ్యకోలునన్. ౨౧౧

క. జననుఁ డొకచిత్రకుచే, వనితారత్నంబురూపు వ్రాయించి పటం
బనువందఁ జూపఁ బంపెను, తనకులగురుఁ డైనశారదానందునకున్. ౨౧౨

గీ. అతఁడు చూచి మెచ్చి యచ్చిత్రకారుఁ జేరఁ బిలిచి తొల్లి చెప్పినట్లు
సతులలోన నాల్గుజాతులు గల విందు, జాతికొలఁది వ్రాఁత సహజమయ్యె†

చ. తొడలును జన్ను లోష్ఠములు దొడ్డలు కన్నులుఁ గాళ్లుఁ జేతులున్
వెడఁదలు మోముఁ గంఠమును వెంద్రుకలుం గుఱుచ ల్లలాటముం
బొడవునొడ ల్వెడల్పుకటమున్ గుడుపున్నడపున్ ఘనం బగుం
జిడిముడిపాటు పుంకె‡ దొగరుఁజీరలు హస్తిని కొప్పు నెప్పుడున్. ౨౧౪

---

* మంత్రి, † ఈగీతము క్రింద నొకప్రతిలో "నాల్గుజాతుల స్త్రీలకు బద్యములు" అని యున్నది. ‡ పాటలుం.

చ. నడుము కృశంబు విన్న జఘనంబు కుచంబులు గట్టి వెంద్రుక
ల్నిడుపులు గన్నులా మెఱుఁగు *గ్గులు కాంతకు వింతభోజనం
బడరుఁ బ్రియంబుఁ గోపము నయంబు సమంబులు దానఁ గొంతె మే
ర్పడ విను రక్తపుష్పపటరాగిణి శంఖినిఁగా నెఱుంగుమీ. ౨౦౫

ఉ. అన్నువ యైనకౌనుఁ గుటిలాలకపంక్తియుఁ జెన్నుమీఱఁగా
వన్నెలు గట్టుఁ బచ్చమరునంబులనుం దుఱుమంగ నేర్చు మా
ఱున్నెడఁ గన్నులార్చు సురశోభితి నేర్పరి యల్పభుక్తితోఁ
దిన్ననిమాటలాడుఁ గడుఁ బ్రిమ్మరి చిత్రిని చిత్రవిక్రియన్. ౨౦౬

ఉ. తెల్లనిచీరలు న్విరులుఁ దియ్యఁదనంబును మెచ్చు వెంద్రుక
ల్నల్లన మోవి యెఱ్ఱన కనత్కనకద్యుతి మేను గన్నులు
త్ఫుల్లసరోజరోచులు మృదుధ్వని కంఠము పాణిపాదము
ల్పల్లవకాంతు లాననము పద్మము పద్మిని జాతి కిమ్మహిన్. ౨౦౭

క. కలియుగమునఁ బద్మిని స,త్కులమున లేదిది తదీయగుణములు గలకో
మలి గాన నెడమలోఁ నోడఁ, దల్పమానంబు మచ్చ దిరమైయుండున్.

గీ. అనుఁడు వెఱఁగుపడుచు నచ్చిత్రకుఁడు భీతి, తోడ నేగి పువ్వుఁదోఁటలోనఁ
జెలఁగుచున్నపున కిట్లు చెప్పిన నఁడు, గో,వ్యసనంబు గనుట శాత్రుఁ గలఁచి.

ఉ. నందనరమ్యహర్మ్య గృహాననమ్మున మన్మథకేళివేళ నా
నందుఁడు భామవామజఘనంబున సన్నపు మచ్చఁ గాంచి యా
నందము డింది కందు మది నాటుకొనం దలయూఁచి శారదా
నందుని నగ్గణం బవగుణంబుగఁ గైకొని నచ్చి మంత్రితోన్. ౨౧౦

గీ. ధర్మమూర్తి యనుచు నిర్మలాత్మకుఁ డని, నమ్మి నార మిట్టి నాటకములఁ
జాల ద్రోహి యైన శారదానందుఁ, జంపు మనిన మంత్రి సంచలించి ౨౧౧

క. దేవా యిది మనెఁ దప్పుగ, భావింపకు భువి మహానుభావులు మదిలో
దైవికమానుషములయుం, దేపియుఁ బొలిపోవకుండ నెఱుఁగుట వినవే.

క. జాడచెడి రాచలోగిలి, పాడుగఁ గన్నంబు వెట్ట బలుబ్రముచ్చులతోఁ
గూడిన నోరుఁ జంపిన ఱం,కాడిన మఱి విప్రుఁ జంప నన్యంబగునే. ౨౧౩

వ ఇంటియకాను. ౨౧౪

*నిగ్గలుగాదగు నష్టభోజనం బడరఁ బ్రియంబు కోపము భయం బోవరం జగదానగుండె.

క. భూపాల గురునిఁ జంపెను, పాపము వల దనుచు మ్రొక్కి పలికినఁ "గామాం
ధో౽పి నవశ్యతి" యనియెను, నాపలుకు నిజంబు చేసి యతఁ డుగ్రుండై. ౨౨౬

గీ. చెఱుగుబుద్ధు లింకఁ జెప్పక నామాట, ద్రోహవైరి నేని ద్రోహిఁ జంపు
మనుడు మాఱుమాట లాడక శారదా, నందుఁ దెచ్చిబంధనం బొనర్చె

మ. ఇటు విప్రోత్తముఁ గట్టి కొంచుఁ జని మంత్రీంద్రుండు చింతించి యు
త్కట చంపించిన బ్రహ్మహత్య నను మగ్గంజేయు నారాజు ని
చ్చటఁ బాపంబున బ్రుంగుఁ గావునఁ దదాజ్ఞాలంఘనం బైన నో
త్కటఁ గావించి జగత్త్రియంబు హితముం గావింతు నంచు న్వెసన్. ౨౨౭

ఉ. ఆతనికట్టు లూడిచి గృహంబున కంపి యమాత్యుఁ డేగి నే
నా తెఱఁ గట్ల చేసితిఁ బ్రియం బగునే యని చెప్పి వచ్చి త
ద్భీతియు నీతియుం గలుగ భీరునిఁ బాలుని నేలమాళిలోఁ
బ్రీతి వహించి దాఁచి తనపెంపునఁ బ్రోవఁగఁ గొన్ని యేండ్లకున్. ౨౨౮

క పాలసుఁడు కితవకేళీ, లాలసుఁ డస్థిరుఁడు మగభిలాషుఁడు మృగయా
లోలుఁడయి నందధరణీ, పాలతనూభవుఁడు విజయపాలుఁడు గదలెన్. ౨౨౯

వ. తదనంతరంబ. ౨౩౦

సీ. పిల్లలు పోరాడె బల్లి యూరక త్రుళ్ళె దమ్మళి పొడసూపెఁ దుమ్మి రెదురఁ
దొఱఁగుచోయిన లేఁగ కొఱలుచునొకకుక్క పఱతెంచెఁ గ్రంపపైనఱచెఁ గాకి
యులుముఁ డొక్కఁడు నూనెతలతోడ నెదురేఁగె మైలచీరలచాకి మోలనదిరెఁ
[1]గాకియును గొరవంక యును తెక్కలపోతు నేటిరింతయు దాఁటె నెడమదెసకు
[2]బైట వెరవుకన్నఁ బాలగుమ్మయుఁ బాఱె, నొంటిపాటఁ బైఁడికంటి వీచె
నెలుఁగు చేసెఁ బెద్దపులుఁగు పామటు దోఁచె, దబ్బిబొబ్బిలి డీయె నుబ్బులడర.

గీ. వానిఁ గనుఁగొని పరివారమ్ము గలఁగుచు, శకునబలము లేమి చనకు మనిన
విజయపాలుఁ డివియు నిజములో కల్లలో, తెలిసికొందమనుచుఁ దిరుగఁడయ్యె

క. దుర్మతికి ధర్మబుద్ధియు, నిర్మలునకు దుర్గతియు గణికలకు దృఢ మహా
కూర్మియుఁ గలిమికి నిలుపును, గర్మములకుఁ దప్పుటయును గలుగవు జగతిన్

శా. ఈరీతిం జను వెల్ల నల్లముల నూహింపంగ శంపాకుచి
స్ఫాగశిజ్యాయుతచాపరోపధరుఁ డై సన్నద్ధసైన్యంబుతో

1. కాకియుఁ నొకగొరంకయును.. అని చిన్నయసూరిగారు. కాకియు నొక పెరకయు సెరుకల
పోతు- 2. పైట వెరవుదప్పబారె చెమరుపోతు. 3. జ్యాలలితోరుచాపధరుఁడై.

భేరీభైరవభాంకృతుల్ దిశల నిర్భేదింపఁగా నేగ ని
[1]ష్కారుణ్యుండు సమస్తదుర్గుణగణాగణ్యుం డరణ్యానికిన్. ౨౩౪

గీ. అచటఁ జెమటకోక యమరించి కుడిచేతఁ, గడిఁదిడేగఁ బట్టి యడమచేత
నెఱక లొయ్యఁ జక్కఁ జెరివి మోమీక్షించు, కొంజుకక్కెరలనుగదియవైచె

వ. ఇట్లొండొంటఁ బులుఁగుల నీల్గించి[2] యొక్కపెట్ట సాళువంబు నెగయించిన

క. తత్పక్షపాతరవము వి, యత్పథమున జలదనినద మన విహగము ల
త్యుత్పాతన్మృష్టిసమయప, తత్పాషాణములు వోలె ధరపైఁగూలెన్. ౨౩౭

సీ. కేరిజంబులఁ గోరి కేపుట దీరించి పూరేండ్లఁ బుడకల బూడ్దెఁ గలిపి
పాలగుమ్మల నేలపాలుగా నొనరించి వెలిచెల మెలఁకువ వెలితిచేసి
బెగ్గురుకముల బెగ్గిల [3]మ్రగ్గించి కొంగలపొగరెల్లఁ గ్రుంగఁజే గ్రొక్క
కక్కెరనెత్తురు గ్రక్కించి కొక్కెరపిండు గుండియలెల్ల బెండుపఱిచి
కారుకోళ్ళ నెండఁ గాఁచించి గోరవంక, బింక మింక వానిపొంక మణఁచి
చెమరుఁబోతుగములఁ జమరి కౌఁజులఁ జించి, సాళువంబు విజయసాంగఁ జేరె

ఉ. అట్టిఖగంబు వేఁటకు నరాధిపనందనుఁ డిచ్చ మెచ్చుచుం
బిట్టల నెల్ల లోఁబఱిచి భృత్యుల కిచ్చుచుఁ బెక్కు వేసటల్
పుట్టఁగ నొక్కచో మడుఁగు పొంతకుఁ బోయి జలంబు ద్రావి యా
[4]పట్టున వీరులఁ గాంచి యొకభారువలం దివియించి యేపుగన్. ౨౩౯

సీ. కొఱ్ఱమీలను దండ్రికొలువులెంకల కిచ్చె వాలుగలను సంగడీలకిచ్చెఁ
[5]గాఁపరలను బిన్నపడవాళ్ళకును నిచ్చె మారువులఁ జనవువారి కిచ్చె
బేడసంబుల నిచ్చె వేడుక కాండ్రకు గెండెల బలుదుండగీల కిచ్చె
పులిమొట్టలను దండువుల దలారుల కిచ్చెఁ గోడిసెలఁ బరిహాసకులకు నిచ్చెఁ
బక్కెమొట్ట రొయ్య పరిగ యింగిలికము, చీరబింపుజెల్ల నారజెల్ల
కుంటముక్కు మొదలుకొని కలవన్నియుఁ, బంటువారికెల్లనొంటి యిచ్చె. ౨౪౦

వ. ఇచ్చి యచ్చోటు వాసి బాణాసనబాణపాణియై వాగురికవాగురాకరాళంబగు
వనాంతరాళంబు సొచ్చి. ౨౪౧

క. బాలుఁడు మెలఁగెను మృగకుల, కాలాకృతిఁ బవనజవన ఘనశునకాళీ
కోలాహలకాలాహిత, కోలాహలకాహళానుకూలక్రీడన్. ౨౪౨

1. ష్కారుణ్యుండతఁడు గ్రపాపజు తాగణ్య. 2. ఇట్టుదొడ్డపులుఁగులనీల్గించి 3. గ్రుంగ 4. చట్టుఁ మీలఁగాంచి యొకజాలిక్రియఁదివిపించి. 5 పాపెరలను బస్తుపడు నులకును నిచ్చె. పాపమీనుల—చిన్నయసూరిగారు

క. తొలిఁదొలిఁ జికిలి మనుఁబోఁ, తులఁ గడఁజుల తేళ్ళ[1] నిర్గ దుష్కుల మఱి యే
కలముల నెలుఁగులఁబులులను, బలువిడిఁగాఁ[2] దునిమెఁజలము బలము న్మెఱయన్.

క. అయ్యెడఁ గోఱలు దీటుచు, దయ్యముక్రియ నొక్కపంది దాఁకుచుఁ దనువుల్
వ్రయ్యలుగఁ బొడిచెఁ దొలఁగం, జయ్యన నలుదెసలఁ బఱచి సైన్యము లెల్లన్.

వ. అప్పుడు కుమారుండు కృతవాహనారోహణుండై యానరహంబు నుం దోలి
వెనువెంట నొంటిం జన్నచని కాఱడవి నీరంబులఁగో జాడవప్పి దప్పిఁ గొనియె
క్కముఁగుఁ జేరి యచ్చోటఁ దురంగంబు డిగ్గి చెట్టునం గట్టి సరసిలో జలంబు
లు గ్రోలి యభయుండై యచట విశ్రాంతికై సిలుచునంత. ౨౮౫

శా. శీఘ్రాపాతనితాంతతాంత[3]తురగస్వేదంబుఁ దీర్పంగ హ్రా
స్వాఘ్రాణంబున మోరయెత్తి తనమీఁద ల్నిక్కఁ దత్సౌరభం
బాఘ్రాణించి చరించి పొంచి కృతముఖ్యాయామభీమాకృతిన్
వ్యాఘ్రం బొక్కటి వచ్చి యచ్చట నృపవ్యాఘ్రాత్మజుం జూచుడున్. ౨౮౬

గీ. హయము దానిరాక కదరి కట్టెవాఁగెఁ[4], ద్రెంచుకొనుచుఁ బాఱె దిక్కులద్రువఁ
బొరఁగొనం దలంచు పులిఁజూచి బెగ్గిలి, విజయపాలుఁ డొక్కవృక్ష మెక్కె.

ఉ. ఆమ్మొయి నెక్కఁ గోపమున నాపులియుం బఱతెంచి తత్ప్రదే
శమ్మున నిల్చిన న్పగడి శాఖలమీఁదికి డాఁగ నేగియుం
గొమ్మను నొక్కబొల్లియెలుఁగుం గని తల్లడమంది దుర్నిమి
త్తమ్ముగ నాఫలంబు లిటఁ దప్పక వచ్చెనె దైవమా యనున్. ౨౮౮

క. క్రిందఁ బులి మీఁద నెలుఁగును, నందప్రియనందనుండు నడుమం గలుగ
న్మందట నొకనుయ్యియు వెను,కందగ నొక గొయ్యిభంగిఁ గానఁగనయ్యెన్.

వ. అప్పుడు. ౨౯౦

గీ తెంపుకలువు తెగయుఁ బుండరీకం బిది, నీవు నచట నుండ నేర్పుగాదు
నమ్మి[5]వేగమిటకు రమ్ము బాలక యని, యెలుఁగు పిలిచెఁ గాఱు టెలుఁగు సెలఁగ.

ఉ. అక్కుమరుండు దాఁప? హృదయంబు యథావిధి నిల్పి రెంటిలో
నిక్కడఁ గొంత యాస గల దిప్పటి కేగెద నంచు మీఁదికిన్
స్రుక్కుచుఁ బోయెఁ గ్రిందఁ బులి చూచి చలంబున మీఁద లిద్దఱుం
జిక్కితి రంచు నాఁగి నిలిచెం దనకన్నుల నిప్పు లొల్కఁగన్. ౨౯౨

1. గండలతేళ్ళ 2. చలమరిగాఁ దునిమిబలము చలముస్కొఱియన్. 3. నితాంతవేగ
4. యప్పుడవాఁగె-(యెంతయువాఁగె) చిన్నయసూరి 5. నెమ్మి.

క్కట పదివేల కమ్మక వికల్పము చేసితి వింకనుండి ని
క్కటముగ నమ్ముకొ మ్మనుచుఁ గ్రొత్తఫణామణి యిచ్చె వానికిన్, ౧౨

క. తనయిల్లుఁ గాచినాఁ డని, మనమునఁ బ్రియమంది యిచ్చు మణు లనుదినముం
గొనిపోయి యమ్ముకొనుచును, ధనికుం డై వాఁడు చెల్మి దప్పినబుద్ధిన్. ౧౩

గీ. దీని కెచటఁ గలుగు దివ్యరత్నంబులు, దీని మొదలితావుఁ దెలియవలయు
ననుచుఁ గోరిపోయి యాపాముచనుజాడ, పట్టి యేగి యొక్క పుట్టఁ గనియె. ౧౪

క. కని తిరిగి పోయి మఱునాఁ, డనలంబును గసవుమోపు హస్తంబులఁ గై
కొనివచ్చి తొఱ్ఱలోపలఁ, జొనిపె భుజంగంబు మిసుకుచు న్నడియుంగన్. ౧౫

క. జాల్మం డిటు గాలిచి యా, పల్మీకముఁ ద్రవ్వఁ జనిన పడి విషములచే
గుల్మములు దగికొనఁగా, నుల్మకములభంగి మఱియు[1]నురగము తెగసెన్.

గీ ఉరగకులము బోయఁ బొరిగొని శమియించె, నట్లు గాన వీని కడలనేల
పాము క్రూరమండ్రు ప్రాణులలో నెల్లఁ, బాముకంటె నరుఁడు పాతకుండు.

క. నామాట నమ్మి డిగ్గన, నీనుముజుఁ ద్రోవు మింక నేగెద ననినన్
మోమోటలేక నవ్వుచు, నేమీ సభ్యుఁడనె యనుచు నెలుఁగిట్టి యెన్. ౧౮

క. ఇలఁ గలపశువుల నెల్లను, బొలియించుచుఁ బాపములకుఁ బొడవయ్యెడు నె
బ్బులితోడి పొత్తు గలదే, పులి నమ్మియ కాదె తొల్లి పులుఁ గొక టిలిగెన్.

మ. వినుమా చెప్పెదఁ దొల్లి యొక్క పులి కావేరీతటిం బ్రాణులం
దనయిచ్చ న్వధియించుచుం దినుచు నుత్సాహంబుతో నుండి కా
లను బోవుం దినునాఁడు మాంసకబళాస్వాదంబుగా నొక్క బొ[2]
క్కఁజాస్యంబున నొక్కదౌడయెడ నిక్కం జొచ్చిన న్నొచ్చుచున్. ౨౦

క. వదనము విసురుచుకొను చది, తుదినాలుకయెత్తుచేత దూపొడుచుక్రియం
గదలించుఁ దాలుపొరఁగ, న్నదలించుం దగ్గు ద్రొక్కు మేదినిఁ బొరలున్. ౨౧

మ. ఇటు దుర్వేదనఁ జిక్కి మాన్పుకొనఁగా నెం దేగినం బ్రాణసం
కటమై ప్రాణులు మారి వచ్చె నని డాఁగం బొఱఁగా నొప్పి యే
చ్చటనుం బాపెడు దిక్కు లేక చనుచున్ శైలస్థలిం జేరి ముం
దట సూచీముఖపక్షిఁ గాంచి తనఖేదం బంతయుం జెప్పినన్. ౨౨

క సూచీముఖంబు డగ్గఱి, నీచెడుగుం దనము మాని నిలువన్ని నీనో
రోచెల్లఁ బోరఁగవలె హింసాచాల వికారుఁడైన నలుగఁడె నీకున్. ౨౩

---

1 కొన్నియురగ 2. బొక్క = ఎముక.

చ. అనవుడు నోరుసాచ్చి వ్యథ[1]యార్వఁగదే మును వచ్చినట్లు వ
ల్లను మొదలింపకుండెవ నలోలత నంచు మొగంబు వంచి వ్రా
లిన నది నోరు సాచ్చి కదలించి క్రమంబున దాడబొక్క[2]ము
క్కున ఁగొనవచ్చె నాపులికిఁ గుత్తుకనాటినకొయ్య నొయ్యనన్. ౨౭౮

గీ. అట్లు వుచ్చిన ముదమంది సూచీముఖుఁ,బొగడి యేగి క్రూరమృగముమఱియుఁ
బసులఁ జంపితినఁగఁ బలలంబులో దాడ,నాఁటెజాడ నెనుక నాటెనంత,[3]

ఉ. క్రమ్మఱ వచ్చి వుచ్చు మని కైకొని వేఁడినఁ బుచ్చివైచి స
ఖ్యమ్మొనరించి నిచ్చలు సుఖస్థితి నుండఁగ నొక్కనాఁడు మాం
సమ్మొకయింత గానకయుఁ జయ్యన నాపులి వచ్చి వక్త్రము
న్నమ్మిక దోఁపఁగాఁ దెఱచిన న్విహగంబురు జొచ్చె నా క్రియన్. ౨౭౯

క. చొచ్చినయంతన కాటునఁ, జచ్చె న్విహగంబు పులులసంగడ మిదిగో
నిచ్చకములాడె దీతని, నిచ్చుటకై యింత యేమి యే నజ్ఞుఁడనే. ౨౮౦

క. జాతివిభేదం బేటికిఁ, బాతకుసకునైన నెడఁ బాప[4] మహాప
ఖ్యాతిఁ గొనవొప్పఁ దిర్య,గ్జాతికపోతంబు చెంచుఁ గాచుట వినవే. ౨౮౧

✓ క. గోదానము ధనదానము, భూదానము నన్నదానమును బధికంబం తాం
భోదానము నుత్తమవి,ద్యాదానము గూడ నభయదానము సరిగవే. ౨౮౨

గీ. వెన్నుసాచ్చువాఁడు దన్ను నమ్మినవాఁడు, జంపి రేపి శిశువు జంపుట్రగు
వంతమొఱుఁగు జాంబవంతుపవారము, బౌస తిప్పు మిట్టియాన విసువు. ౨౮౩

చ. అనుచు నిరుత్తరంబుగ దయామతిఁ బల్కెడు నంత రాజనం
దనుఁడును లేచినన్ క్షణము దానికిఁ గూర్కెడు నిద్రపోకుమీ
యని తొడమీఁద నూఁదికొని యూఁతెులుఁ గించుక కన్నుమూయఁగాఁ
గని పులి పల్కెనాని మొఱుఁ గంపము పుట్టగ భీతు నెట్టుచున్. ౨౮౪

గీ. కోటులు గలవాని గోవులు గలవాఁడ, గొమ్ములు గలవాని నమ్మవలదు
బమ్మరించెనేని బ్రతుకంగవచ్చునే, మెఱుఁగు బోడి చెలిమి యేల[5]నీరు ౨౮౫

క. మొన్న నొకఁడు దోలితి వాఁ, డిన్నగ మిక్కిల్కె వాని నిది కమనాసం
పన్నక్రియ బోనిడుకొని, నిన్న విడిచిపెట్టె నేడు నిజమరిగోలెన్. ౨౮౬

1. నమ్మిచొచ్చి కెలియార్ప 2. దాడబొమ్మి ముక్కునఁగొనివచ్చె నాపులికిఁగుత్తుక నాటి. గ్రా.
3. వుచ్చినను ముదమందు ముఁ బులుఁగఁబోలఁ బొగడియును నేగి యూక్రూరమృగము మఱి యుఁ, బసులఁ జంపి తింగఁ జావలముతోడఁ, నాఁటెదాడ నెలయుకయు నాటెమగుడ
4. ఘాతుకునకునైన నెడయుగ్గనఁ దవతో నాతుకనవచ్చు గ. పాండు లీల,

క. కూరిమి గల దని నమ్మకు, క్రూరమృగంబులకుఁ గరుణ గూడునె యిది నీ
చేరువ నుండుట నేఁటికి, నీరీతుల బుజ్జగించె నెల్లిటి కొఱకై. ౨౮౪

గీ. దానిఁ జెప్పనేల యేపదె యొక యేఁడు, పట్టి నాఁడు నెలలు పట్టెఁ గాక
మిమ్ముఁ జంపి తిందు నమ్ము మీ యొకనాఁడు, దీఁ ద్రోచి బ్రదుకు తెరువుగనుము

చ. అనవుడు వాఁడు నిక్కముగ నాత్మఁ దలంచి యెలుంగుఁ గూలఁద్రో
చిన నది జాఱుచుం దెలిసి చేతికి లోనగు కొమ్మ పట్టి యొ
య్యనఁ బఱతెంచి బెగ్గిలు నృపాత్మజుఁ గన్గొని యల్పబుద్ధి వే
మన నను నమ్ము మంటి భయమందకు మీ యని పల్కుచుండఁగన్ ౨౮౬

క. కలకలఁ బలికెడుపక్షుల, కలకలములు సకలదిశలఁ గలయఁగఁ బొలయం
దళదళికులముగ దళశత, దళదళములు విరియఁ బ్రొద్దు తళతళఁ బొడిచెన్ ౨౮౭

గీ తమముతోడఁ గూడఁ దరలి శార్దూలంబు, శైలగుహల కేగెఁ జాలడస్సి
తరణికిరణపంక్తి సరసఁ జెట్టువనుండి, యెలుఁగుఁ గూడి బోలుఁ ఢిలకు డిగ్గె

క. ఆయెలుఁ గతని బిలిచియ, న్యాయువి పరలోకపీడనం[1] బగు దురితం
బీయెడన పాయఁ జేసెద; రాయిటవినుమిఁక "ససేమిరా" యను మెవ్వడున్.

క. ఈనాలు గక్షరంబుల, నీనేరమి నొరుఁడు చెప్పెనేని వికారం
బూనక తొల్లిటిక్రియ స, న్మానము గైకొనుము మంచిమాటలఁ గోడన్ ౨౯౦

క. అని వీడ్కొలిపిన తఱి న ట్లనెయాతఁడును "స్ససేమిరా" యనుచు వనం
బున భూతావిష్టుని చా, డ్పునఁ దిరుగఁగ వానిహాయము పురిఁ జేరుటయున్.

సీ. అశ్వరత్నం బొంటి నరుదెంచె నిన్నఁటి శకునము ల్పాపనిఁ జంపె నొక్కొ
యని తలంకుచు నందజనపాలుఁ డాజాడఁ బఱతెంచి యడవిలోఁ బొలుఁ జూచి
యన్న యిదేమి రావన్న "ససేమిరా" యనుడుఁ గలఁగి యెత్తి యడుగుటయును
నాలుగక్షరముల నోలిఁ బల్కెడువానిఁ దోతెక్కనిపోయి మందులనొసర్చి
వీని భూతశంక విడిపించువారికి, నర్ధరాజ్య మిత్తు ననుచుఁ జాటి
వేలుపులకుఁ బెట్టి వేఁడికొన్నను నాలు, గక్షరములు విడువఁడయ్యె వాఁడు.

ఉ. నందనృపాలుఁ డిట్లను మనంబునఁ గుళ్ళుచు నెల్ల వేల్పులున్
మందులు మ్రొక్కలు న్మణులు మంత్రములున్ వృథ యయ్యె శారదా
నందుఁడ యిప్పుడున్నఁ బ్రియనందనుఁ దెల్పఁగ నోపు నట్టి పె
ద్దం దునిమించినాఁడ వలదా హితు లెవ్వరు నడ్డపెట్టఁగన్. ౨౯౩

1. యన్యాయపరతఁజేయుఁపీడన.

ఉ. నావుడు మంత్రి చిత్తమున నవ్వుచు నావిధ మయ్యె నాఁడు, నేఁ
డీవిధ మయ్యెఁ, జేరుకొన నేటికి నిందలపాల దృష్ట మా
దైవము గల్గెనేని భువిఁ దత్సముఁ డొక్కఁడు గల్గి నేరఁడే
కావున బమ్మరింప॥ బని గా దని యూఱడఁ బల్కె భూపతిన్. ౨౯౪
ఉ. ఆవిభు నూఱడించి నిలయంబున కేగి బిలంబువిప్రుతో
నీవిధ మెల్లఁ జెప్పిన మహీసురుఁడు న్సచివాగ్రణీ భవ
ద్భావరుఁ జేరె నాఁటిగురుపుత్రిక యేకవయేఁటి పాప నీ
జీవము చిక్కఁదీర్చు నని[1] చెప్పుము నీ వని పంచె నాతనిన్ ౨౯౫
వ. అటకుం జని. ౨౯౬
ఉ. ఆతఁడు విన్నవించినఁ బ్రియాన్వితుఁడై సుతుఁ దోడుకొంచు ధా
త్రీతలనాథుఁ డింటి కరుదెంచుడు నాదరణీసుకుంతు క
న్యాతిలకంబు రాజవసికాంతరిక క్రృతి నిల్పి సద్యవి
ద్యోతితరీతిఁ దోఁప వినుచుండెఁ గుమారు"ససేమిరా" ధ్వనిన్. ౨౯౭
వ ఇట్టి నాలుగక్షరముల నాలించి విని యందలు నూరకుండఁ గని కుమారు
నుద్దేశించి పద్య మిట్లని చదివె. ౨౯౮
క. "స"జ్జనభావము గలుగు సు హృజ్జనముల మోసపుచ్చు టిది నేరుపె నీ
యజ్జతోడ మీఁదఁ గూర్కిన, యజ్ఞంతువుఁ జంపఁ జూచు టది పౌరుష మే ౨౯౯
వ. [2]అని చదివిన బాలుఁడు దా విని ప్రథమాక్షరము విడిచిపెట్టి "సేమిరా"
"సేమిరా" యనుచున్నంత నందఱు నానందన రేంద్రుతో నానందంబు నొంది
మేలు మే లనుచు నుండఁ దక్కలకలంబు మాన్ప జవనికలో గురుండు ౩౦౦
క. "సే"తువుఁ గని జలధిసం, జాతధనుష్కోటిఁ బడిన సద్విజహతికిం
బాతకము వాయు మిత్రవి ఘాతికిఁ బాతకమె కాని గతి గలుగ దనా ౩౦౧
వ. అని రెండవపద్యంబుఁ జదువఁ గుమారుండు రెండవయక్షరంబు విడిచి 'మిరా
మిరా" యనుచుండ నిట నయ్యాచార్యుండును, ౩౦౨
క. "మి"త్రద్రోహి కృతఘ్నుఁడు, విత్రగురుద్రోహి చౌర్యవిద్యాపరులున్
మిత్రశశిస్థితి మేరగఁ, బుత్రులు గలిగియును నరకమునఁ బడుదు రనా 303
వ. అని తృతీయపద్యంబు పఠించినఁ దృతీయాక్షరంబు విడిచి "రా, రా" యను
నందనుం జూచి యమందానందుం డగు నందు నుద్దేశించి శారదానందుఁడు

1. జీవము వేదదీర్చునని 2. ఈవచనము మొదలు కందపద్యమువలె నడచుచున్నది.

క. "రాజ!" భవదీయుఁడైన త,నూజునకు న్శుభము నోజ నూల్కొను విద్వ
ద్రాజికి ధనదానము ని,ర్వ్యాజమునం జేయు మిహపరంబులు గలుగున్. ౩౦౬

వ. అని యిట్లు చతుర్థపద్యంబుఁ జదివినఁ జతుర్థం బగు రకారంబుతో నవ్వికా
రంబునుం బాసి బాలుండు తండ్రికి మ్రొక్కి మిత్రద్రోహ లక్షితం బగు ఋక్ష
వ్యాఘ్రవృత్తాంతం బంతయుం జెప్పిన నచ్చెరువు మెచ్చునుం బిచ్చలింప నవనీ
పతి జవనికవంకఁ జూచి. ౩౦౭

గీ. పిన్నదాన విచట నున్నదానవు తల్లి, యింటి వాకిలియును నెఱుఁగ వీవు
కానలోనఁ బులియు మానిసియు నెలుంగుఁ, దొడరు చేత లెట్లు తోఁచె నీకు.

వ. అనుడు నతం డింకఁ దాఁపం బని లే దని తలంచి. ౩౦౮

క. భూనాయక! భూసురకృప, నానాలుక నొప్పు వాణి నానాద్భుతవి
జ్ఞానమునఁ దెలియు నన్నియు[1], భానుమతీదేవిమచ్చభంగి న్మదిలోన్. ౩౦౯

మ. అనినన్ దిగ్గన లేచి చూచి తెరలో నాచార్యుఁగా నిశ్చయిం
చి నరేంద్రుం డతి హృష్టుఁ డౌచు సచివుం జేపట్టి నీయట్టి బం
ధునిధానం బిఁక నొండు గల్గునె గురుద్రోహంబుఁ దప్పించి యెం
దును బాపంబును బొందకుండ నను ధన్యుం జేసి తీనేర్పునన్. ౩౧౦

క. ప్రణయము దప్పక యాబ్రా, హ్మణహత్య దొలంగ రాజ్య మలరఁగ సుతుదు
ర్గుణములు విడిపించితి నీ, గుణములచే నన్ను జట్టిగొంటివి సుమ్మీ. ౩౧౧

వ. అని గ్రుచ్చి కౌఁగిలించుకొని తనపట్టిచెట్ట వట్టుకొని పుణ్యసులభానుమతియగు
భానుమతియుం దానును గురు డగ్గఱి. ౩౧౨

క. ఎల్లవిధంబులఁ జూచినఁ, దల్లియుఁ దండ్రియును నీవె దయసేయుము మా
కల్లలు లోఁగొని మము నీ,నల్లిలుగఁ జూడు మనుచు నరపతి మ్రొక్కెన్. ౩౧౩

శా. ఈచందంబున మ్రొక్కి యందలముఁ దా నెక్కించి భూమీవరుం
డాచార్యుం గొని వచ్చి గద్దియపయిన్ హర్షంబుతో నుంచి శి
ష్టాచారంబునఁ బూజచేసి తనరాజ్యశ్రీ సమర్పించి త
ద్వాచాదత్తముగాఁగఁ గైకొని ప్రసాదం బంచు నేలె న్నృపిన్. ౩౧౪

మ. అని మంత్రీంద్రుఁడు చెప్పిన న్విని కథాహ్లాదప్రసన్నాత్ముఁ డై
జననాథుండును మంత్రి లేనిపని మోసం బంచుఁ జేపట్టి యొ

1 జ్ఞానముఖంబున తెలియున్.

య్యన సత్త్వాఢ్యుల చేతఁ బుష్పకనిభం బౌ దివ్యసింహాసనం
బనుపొందం గొనిపోయి నిల్పె నిజహర్మ్యంబైన ధారాపురిన్. ౩౧౫

ఉ. శంభుముఖాంబుజార్కు దృఢసారవరాహశరీరవశ్యవి
శ్వంభరు శాంభవీవరదు సంభృతరక్షణు సర్వలోకకు
క్షింభరు సిద్ధసాధ్య సుర కిన్నర పన్నగ గీతకీర్తివి
శ్వంభరు జంభవైరిసహసంభవు దృష్టవపుర్విజృంభణున్. ౩౧౬

ఉ. శంకితకింకరవ్రజవశంకరుఁ బంకజనేత్రమిత్రు న
భ్రంకష కాంతిసంకులకపర్దవిభూషితభవ్యదివ్యకూ
లంకషు నిష్కళంకితవిలాసకలాపధురీణు శౌర్యస
ర్వంకషవైభవాంకితవశంకరు శంకరు లోకశంకరున్. ౩౧౭

మాలిని. పరమకరుణలీలా భక్తలోకానుకూలా
పరిచితసురరత్నా భగ్నదైతేయవత్నా
సరసిజహితనేత్రా సచ్చిదానందగాత్రా
హరిహరమయరూపా యాగయోగస్వరూపా. ౩౧౮

గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలికభేకఫణీంద్ర వీరఘోట్టవిభాళాది బిరుదప్రకట చారిత్ర కళింగదేశ నిర్ధూమధామ త్యాగనాగార్జున కర్ణాట ద్రవిళాంధ్రమహారాష్ట్ర భూపాలహూప నూపురసుందర చరణారవింద సనదప్రోలి పురవరాధీశ్వర వెలనాటిపృథ్వీశ్వరరాజ్యసముద్ధరణ శ్రీకొఱవివెన్నయామాత్యపౌత్ర హారీతసగోత్రపవిత్ర సకలసుకవిమిత్ర కసవరాజతనూజ గోపరాజ విరచితం బైన సింహాసనద్వాత్రింశిక యను కావ్యంబునందుఁ బార్వతీపరమేశ్వరానోన్యప్రశ్నోత్తరంబులును భర్తృహరి వైరాగ్యంబును విక్రమార్కుని రాజ్యసాయుజ్యంబులును, శాలివాహన విజయంబును భోజునికి సింహాసనప్రాప్తియు మంత్రిగుణప్రశంసయు నందోపాఖ్యానంబును నన్నది కథావతారిక ప్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

# సింహాసనద్వాత్రింశిక.

## ద్వితీయాశ్వాసము.

---

క. శ్రీరామాకుచశైలవిహారుని మునిహృదయగహ్వరాశ్రయుని మహా
దారుణనఖదారితరిపు, వారణనరసింహు నిగమవనసంచారిన్. ౧

క. మనమునఁ దలఁచుచు విద్వజ్జనదైవజ్ఞాది సర్వజనసమ్మత మా
దినమున భోజుఁడు సింహాసన మెక్కం గడఁగె రాజ్యసంపద మెఱయన్. ౨

సీ. ధారాపురంబులోఁ దారాపథమువోలు రత్నమండపములో యత్న మమర
నిర్మైనపసిఁడికంబమ్ముల మేడలో దివ్యసింహాసనస్థితి యొనర్చి
యవరోచనాజ్యదూర్వాగ్రమపల్లవపుష్పసిద్ధార్థదధిఫలక్షీరములును
నాదిగాఁ బెక్కు పుణ్యద్రవ్యములు గూర్చి పుణ్యాహమున భూమిపాలుపుదీర్చి[1]
దేవతరువుమార్గిఁ దెల్లనిగొడుగుతోఁ, గూడఁ బసిఁడికామకుంచె లచట
నిలిపి పొంతఁ గైదువులు సేర్చి యర్చన, లిచ్చె నుత్సవంబు పిచ్చలింప. ౩

వ. తదనంతరంబ నానాపురాణేతిహాసశ్రవణంబులను బంచమహావాద్యప్రపంచంబులను సంగీతసాహిత్యసంగతనాట్యప్రసంగంబులను బ్రతియామదీయమాన ధూపదీపాదినైవేద్యమహోపచారంబులను దత్పరివారదేవతలకు నృపబృంహణంబుగా సేమం బగునేమంబున నారాముండునుం బోలె నాయామినిం గడపి మఱునాఁడు కృతమంగళస్నానుం డై ప్రత్యూషనిత్యకృత్యంబులు నిర్వర్తించి యప్పుడు మకరతోరణంబులునుం దెలిముత్తియంబుల తోరణంబులునుం గలువడంబులు, బలికూటంబులు మేలుకట్లునుం జీరగుండ్లును మృగనాభిలేపనంబును, ముక్తాఫలరంగవల్లికలును నెల్లివిరియ నుల్లంబుల నుల్లసిల్లుపొరులును నానాదిగంతాగత విద్వజ్జన జ్యోతిషిక శాకునిక స్వరవేదులును వందిమాగధబృందంబులును బసిండి పళ్లెరంబుల మాణిక్యదీపంబులతో నివాళింపు చున్న పుణ్యాంగనలును హిత రాజలోకబంధువర్గంబునుం దలకొన జయ జీవ వర్ధస్వ సుఖీభవాది శుభసూచకశబ్దంబులును బహువిధవాద్యరవంబులును, నొక్కటై దిక్కులుపిక్కటిల్ల మిక్కుటంబుగా సుముహూర్తంబున సర్వతోముఖంబగు మహాసింహాసనంబు డగ్గఱి ప్రదక్షిణంబుగాఁ దిరిగి చూచి తత్తద్ద్వారంబుల కడల నున్న బొమ్మలతలకడల నున్నపిన్నగద్దియలలో నెందేని నడుగిడి పెద్ద

---

1 పులితోలుపైభూతి చెలువుదీర్చి.

గద్దియ యెక్కుట భావ్యం బని వారశూలరహితంబుగా నొక్కదిక్కున నిలిచి సకలజనకలకలంబు నుడిపి మౌహూర్తికసావధానశబ్దంబు లోలయ నిష్టదేవతలం దలంచి ప్రశస్తఖడ్గహస్తుం డై పూర్ణఘటికోచితనాదావసరంబు నెదురు చూచుచుండ. ౪

—: మొదటిబొమ్మకథ :—

క. మును గడియారంబునఁ గట్టినపెను జేగంటరవము శేయను నెడ గ్ర
క్కున భోజుం డడుగెత్తినఁ, గని నిలునిలు మనుచు బొమ్మ కలకలఁ బలికెన్. ౫

చ. పలికిన భోజుఁ డద్భుత మపారముగా మది నిండి పాఱఁగా
నిలిచి గతజ్ఞ తద్జ్ఞ ధరణీసుర మాగధవందిగాయకా
కలకల మెల్ల మాన్చి శుభకాలములో నిది యెక్కఁ బూనఁగా
వల దన నేల యిందుల నివారణకారణ మేమి నావుడున్. ౬

మ. తనవాక్యంబులు తత్సభాజనుల కుత్సాహంబు నాశ్చర్యముల్
పెనఁగొల్పంగఁ బసిండిబొమ్మ నగి గంభీరంబుగాఁ బల్కె నో
జననాథా విను చంద్రగుప్తనృపసంజాతుండు కంజాతమి
త్రనిభుం డుజ్జయినీపురిం బరఁగె నేకచ్ఛత్రసత్కీర్తితోన్. ౭

వ. ఆయనఘునత యెట్టి దంటేని- ౮

క. సిద్ధులకు నసాధ్యము లగు, సిద్ధులు నెనిమిదియుఁ దనకు సిద్ధంబులుగా
నిద్ధరణిఁ బౌరుషమునఁ బ్రసిద్ధుం డగు సాహసాంకుఁ జెప్పం దరమే. ౯

శా. సంభూతాన్యవిడంబడంబరమిథఃసంరంభగర్వోర్వశీ
రంభానాట్యవిజృంభమాణమతివిస్రంభాదిశుంభన్మనో
జంభారిప్రియసంభృతానకమహాసంభావనాసంభవా
స్తంభోదగ్రుఁడు విక్రమార్కుఁ డతఁ డేతన్మాత్రుఁడే చూడఁగన్. ౧౦

క. అతిశయవితరణగుణమున, నతనికి సరిరాక యెక్కనలవియె నీకుం
గ్రతువులు నూఱును జేయక, నితరుల కమరేంద్రపీఠ మెక్కం దరమే.[1] ౧౧

క. అనవుడు భోజుఁడు విస్మయ,మును సిగ్గు నహంకృతియును ముప్పిరిగొన ని
ట్లనియె నొకయర్థి వేఁడినఁ, దనియఁగ సహపాదలక్షధన మే నిత్తున్. ౧౨

క. నావితరణ మిది యల్పమె, నావుడు నది నవ్వి తనగుణం బన్యులకుం
దా వినిపించుట కొఱఁతగ,దా వివరము తప్పి తీవు ధరణీనాథా! ౧౩

1 మెక్కుటగలదే.

క. ఇది మొదలు కొఱఁత యయ్యెం, దుదిఁ బుణ్యము హానిఁబొందె దొడ్డతనంబుం
జెడరెం దనుఁ దాఁ జెప్పొను, టిది కష్టము తొంటిసిరి యెఱుఁగవు చుమ్మీ. ౧౪

ఉ. ఆయువు మాత్ర మౌషధము నర్థము దానము మానభంగ మ
న్యాయము నర్థనాశము గృహవ్యసనంబును దాఁపురంబుగాఁ
జేయుట నీతియుక్త మటుసేయక తా నయి దానధర్మముల్
చేయుమనంచుఁ జెప్పినను సీయని నవ్వారె ధర్మ మెంచరే. ౧౫

క. ఈసమయమునకుఁ దగ నీతి, హాసము గల దొకటి వినుము హరిదశ్వకులో
ల్లాసకరుఁ డయోధ్యాపుర,వాసి సుదర్శనుఁ డనంగ వసుమతి నేలెన్. ౧౬

చ. అతఁడు సపాదలక్షవసుధామరపఙ్క్తికి భోజనంబు సు
వ్రతముగఁ బెట్టుచుం దివిజవర్గము మిక్కిలిఁ దుష్టిఁ బొందఁగాఁ
గ్రతువులు పెక్కుసేయుచు జగన్నుతుఁ డై సరయూతటంబునం
గతిపయవాసరంబు లధికం బగుసత్ర మొనర్చుచుండఁగన్. ౧౭

క. శారద వీణావాద్యవి,శారద తగురూప మైనచందము మెఱయన్
శారదనీరదనిభుఁ డగు, నారదముని చేరవచ్చె[1] నరపతిఁ జూడన్. ౧౮

క. వచ్చినమునిఁ గనుఁగొని యిటు, విచ్చేయుం డనుచుమ్రొక్కి విభుఁ డుచితార్ఘ్యం
బిచ్చి కృతాంజలియై నే, సచ్చరితుఁడ నైతి మీ ప్రసాదపు కలిమిన్. ౧౯

గీ. ఎచటినుండి యిటకు నేతెంచితిరి నన్ను, ధన్యుఁ జేయ నన్నఁ దపసి వలికెఁ
బరమధర్మశీల బ్రహ్మలోకమున నీ, దానధర్మవార్తఁ దడవ వింటి. ౨౦

చ. విని నినుఁ జూడ వచ్చితి భువిం గడుఁ బుణ్యుఁడ వంచు నన్న నో
మునివర శిష్యుఁగాఁ దలఁచి ముద్దునఁ బల్కెద వెంతవాఁడ నే
ననుచు వినీతుఁ డైనఁ గొనియాడి గుణాఢ్యుఁడ వీవు నీయశం
బనఘచరిత్ర బ్రహ్మభువనాంతము ముట్టిన దింత చాలదే. ౨౧

క. విశదమగు కీర్తివసనము, కృశరక్షక ! సప్తతంతుకృత మయ్యుఁ జతు
ర్దశభువనంబులఁ గప్పెను, వశమే నినుఁ బొగడ శేషవాణీశులకున్. ౨౨

వ. కావున నీ కసాధ్యంబు లే దె ట్లన్న. ౨౩

క. ధాత్రీశ పుణ్యనిర్మల,గాత్రులకును జగములో నగమ్యము గలదే
క్షత్రియపుత్రుఁడు విశ్వా,మిత్రుఁడు బ్రహ్మత్వపదవి మేరల మీఱెన్. ౨౪

క. స్వకులోచితధర్మముఁ ద,ప్పక మనువారలకు వలయుపని దుర్ఘటమే
ప్రకటంబుగ ఋషిపత్నులు, సికతాకలశముల జలము చేవుపుగొనరే. ౨౫

1. వచ్చె నపుడు నరపతిఁ జూడన్.

వ. దీనికి దృష్టాంతంబుగ నీవుఁ దినం గుండఁ జేసి నీరు నించిన నిలుచు నని యిసుక చేతి కిచ్చిన నృపాలుం డందుకొని. ౨౬

క. అటు చేసినఁ జిత్రము మి,క్కుటముగ నాదానధర్మగుణసిద్ధునిచే
ఘటితరస మైనసికతా,ఘటి యొప్పెను రసము ఘుటికగట్టినభంగిన్.[1] ౨౭

క. కృతిఁ గుండలు నిలిచిన స,త్కృతిఁ గనుఁగొని నారదుండు దినమును నీ వీ
గతిఁ బుణ్యకీర్తి వెలయిం,పు తపోనిష్ఠలను వెలసి పుణ్యవిచారా. ౨౮

వ. అని యుపదేశించి చనిన. ౨౯

గీ. ఇట సుదర్శనుండు నీమట్టికుండల, నిచ్చ వండిపెట్ట మెచ్చుగాదు
మంటఁ జేసి మొదలి వంటనే కటిగొన్న, దానఁ దొలుత వండఁ దగుట యెట్లు.

మ. అని మృద్భాండము లెల్ల మాని సికతాయత్తంబు లా కుండలన్
ఘనుఁ డాపాయసశాకసూపముల పాకం బెప్పుడుం జేయుచుం
దనియన్ బ్రాహ్మణభోజనంబు లిడుచుం దానొక్కనాఁ డప్పుడా
ర్థనికాయంబులు వండుచోటఁ జని తత్సామగ్రి వీక్షింపఁగాన్. 3౧

క. వెస లుడుకం గని నృపుఁ డు,బ్బసమున నే నిట్టిఘనత వడసితి ననఁగా
నిసుమునఁ జేసినకుండలు, విసవిసలై విరిసెఁ బుణ్యవిపరీతగతిన్. 3౨

క. ఉలికి యతం డప్పుడు మదిఁ, గలఁగుచు నిటఁ గల్మషంబు గలసెనొ తగు వి
ప్రులయెన్నిక గూడదొ హె,చ్చాతలు మంత్రముఁ దప్పిరొక్కొ ధర గదలెనొకో.

మ. అని యుత్సాహవిహీనుఁ డౌచు నతిచింతాక్రాంతుఁ డై యుండఁగాఁ
దనయిచ్చ న్మని తొంటిచాడ్పున వియద్భాగంబు శోభిల్ల వ
చ్చినఁ బూజించి మునీంద్ర నామహిమకుం జేటయ్యెఁ బో నీవు చె
ప్పినమర్యాదయు నెట్లు దప్పె ననినం బ్రహ్మర్షి బోధించుచున్. 3౪

క. మర్యాదఁ దప్పెఁ జిత్తవి,పర్యాసాహంకృతులను బార్థివ "గర్వా
త్కార్యం వినశ్యతి" యనుచు, నార్యులు మునుచెప్పునీతి యదితప్పగునే. 3౫

✓ క. పర్వతపథమున రథమును, బర్వస్త్రీసంగమమున బ్రాహ్మ్యవ్రతమున్
గర్వమున ధర్మకార్యము, నుర్వీభాగమున నావయు న్నడవ దనా. 3౬

---

1. ఉ. ఆగతిఁ గుండ నిల్చిన ధరాధిపుఁ గన్గొని నారదుండు నీ
వీగతిఁ బుణ్యకీర్తి వెలయించుచు నిచ్చలుఁ దీర్చ సత్రము
ద్వేగములేక చేయు మని తెల్పి వియద్గతి నేగ నంతలోఁ
ద్యాగము భోగముం దగుసుదర్శనుఁ డచ్చటఁ దాను మెచ్చుచున్.
గీ. క్రొత్తకడవ దెచ్చుకొని వండి మఱి దాని, మీఁద వండిపెట్ట మెచ్చు గాదు
మంటఁ జేసి మొదల మంటనే కటిగొన్న, దానఁ దొలుతవండఁ దగుట యెట్లు.

క. ఇంతమహిమ వడసితి నని, సంతసమున నీవు రాజసము గైకొన్నన్
సంతతముఁ జేయు సుకృతం, బింతయు నిట్లింకె నింక నే మనవచ్చున్. ౩౮

ఉ. నావుడు భూవరుండు మునినాయక నేనపరాధి నైతి నేఁ
డావిధ మేక్రియం గలుగు నానతి యిమ్మని మ్రొక్కినంత నా
దేవమునీంద్రుఁ డిట్లనియె ధీరుఁడ వై మది నుబ్బు లేక భూ
దేవసపాదలక్షఁ బరితృప్తి యొనర్పుము భుక్తిముక్తులన్. ౩౯

క. బహుదినములు జరపఁగఁ ద, న్మహిమయుఁ జేకూరు నింక మనమున గర్వా
గ్రహము వల దనుచు శుభ మొం, దహితంబుగఁ జెప్పి నారదుఁడు సనినంతన్.

క. తాఁకిన మఱి వంగినక్రియ, నాఁకొని వడివడుకొన్న యనువున నృపుఁడుం
దేఁకువ సెడి తొల్లిటివ్రత, మాకొలఁదినె నిత్యసత్ర[1] మచ్చట జరిపెన్. ౪౦

ఉ. కావున నేన దాత నని గర్వము గైకొని పల్లి నీ వస
ద్భావుఁడ వైతి దానమును బౌరుషముం బరు లెన్నకుండఁగాఁ
దా వినిపించెనేని యు నతండుఁ దృణంబుగ నొక్కయెత్తుగన్
ద్మావర గంజిలో మెతుకు గల్గినఁ గ్రొవ్వట నీమహత్త్వముల్. ౪౧

గీ. అనుచు ఘనుఁడు భోజుఁడును మనంబున స్రుక్కి, బన్మరిల్లి పసిఁడిబొమ్మ! నాదు
దాన మల్ప మన్న దానవు మీరాజు, దానమెంత చెప్పు దాన నిలుతు[2]. ౪౨

వ. అనిన సాలభంజిక యిట్లనియె నతం డిట్టి మహావదాన్యుండు. ౪౩

క. పొడగన్నంతనె వేయును, నొడివినఁ బదివేలు నగిన నూత్వేలు మనం
బొడఁబడి మెచ్చినఁ గోటియు, నడిగెడువారలకు నిచ్చు హాటకమయముల్.

మ. అది యెట్లన్న నతండు కీర్తి దిశలన్ వ్యాపింప భూమండలం
బుదధు ల్మేరగ నేలుచుండి యొకనాఁ డుర్వీశులు న్మంత్రులున్
సుదతీరత్నములున్ రసజ్ఞులుఁ గవిస్తోమంబులుం గొల్వ న
త్యుదయశ్రీఁ గొలువిచ్చి యుండఁగఁ గవీంద్రుం డొక్కఁ డేతెంచుచున్. ౪౪

[3]సీ. దండశూకాధిపోద్దండభుజాదండభూరివిశ్వంభరాభారధుర్య
జంభారిపరికీర్తితాంభోజినీమిత్ర[4]సూనుసమాహియదానరాయ

1 మాకొలఁదినె నిత్యసత్రమచ్చట—చిన్నయసూరి గారి పాఠము. మాకెలసత్రంబుభంగినచ్చట—ఇతరప్రతులలో—2 దాన మెంత నీవు దానిఁదెలుపు. చి. సూరిగారు. దాన మెంత నేర్పు—3. ఈపద్యములోని ప్రాకృతభేదములు తెలియవచ్చుటలేదు. పద్యములోని తప్పొప్పులు తెలియలేదు. ఎవ్వరియొద్దనైనఁ బ్రతియున్నచో దిద్దిసవరించి మాకుఁబంపఁ బండితులం గోరెదము. 4. యంభోరుహిణీమిత్ర.

అక్కిణహృదయ దండార్కకేళః కేళిపతివఃకణీవళఃపకడక్క
అంకక్కరిక్క మహాలదసాందన లవలవప్పహిత తులఃకధీర
ధీరసంపదస్తు దేవబంధకహిమ[1], దఃకస్తాక్కు మోదర్యనిచయ
యనుచు నాల్గుభాషలను రాజు దీవించి, నయనసంజ్ఞ నాసనమున నుండె.౪౭

సీ. రాజేంద్ర యాఅక్షరముల పేరిటివాఁడ నాద్యక్షరము మాన సర్వవేది
రెండక్షరములఁ బరిత్యజించిన నాట్యకర్త మఱిఁ డుడిపిన గతవిదుండ
నాలుగు నుడిగింపఁ జాలనేర్పరి నైదు విడిచిన బుధుఁడ నీవిధము గాక
సర్వాక్షరంబులుఁ జదివిచూచిన బుద్ధి బలముగాఁగల యట్టి ప్రౌఢుఁ డనఁగ
నేతిబీఱకాయనీతి గాకుండంగ, నిన్ని విద్యలందు నెన్నఁబడ్డ
సార్థనాముఁ డైనయర్థిగా నెఱుఁగుము, విబుధపంకజార్క విక్రమార్క. ౪౮

గీ. అనినఁ గ్రమ్మఱఁ జదివించి యల్లనవ్వి, ధరణిలోనీవు "చతురంగతద్జ్ఞ"సంజ్ఞఁ
బరఁగినాఁడవయనుఁడుభూపాలుఁబొగడి, మెలమిఁజతురంగతద్జ్ఞకవీశ్వరుండు.

క. ఇది తగుఁ దగ దనక కళా, విమలకు నీసమ్ముఖమున విద్యలమెఱుకం
బొదపెట్టుట హనుమంతుని, యెదుర వెసం గుప్పిగంతు లెగయుటచుమ్మీ.[2]

ఉ. అంబుజమిత్రతేజ భవదగ్రకరప్రసృతంబులైన దా
నాంబువులందుఁ బుట్టె భువనాంతము నిండుచుఁ గీర్తిపుండరీ
కంబు ప్రతాపసూర్యుఁడు వికాస మొసర్పఁగ నాకసంబు భృం
గంబుగ లోనఁ బూని యధికం బగువాసన నొప్పు నెప్పుడున్. ౫౦

క. అని చెప్పినపద్యములోఁ, దనకీర్తివ్యాప్తియుం[3] బ్రతాపస్ఫురణం
బును గని భాండాగారికుఁ, గనుసన్నం బిలిచి మెచ్చుగా నాతనికిన్. ౫౧

క. ధనమిప్పించె విలోకన,మునకుం బలుకునకు హసితమునకుఁ గవికి వే
యును బదివేలును లక్షం,బును గోటియుఁ బసిఁడిటంకములు చొప్పలుగాన్.

క. ఘనుఁడు కవి వీడుకొని యొ,య్యనభాండాగారిఁ బిలిచి యర్థి ననుం జూ
చినఁ బలికించిన నవ్విం,చిన మెచ్చించినను నిట్ల చెప్పక యిమ్మా.[4] ౫౩

చ. అని సెలవిచ్చినన్ ధనగృహస్థితుఁ డా తనలెంక యిట్టిచొ
ప్పున నొసఁగంగ యాచకులు భూజనకల్పమహీజ మంచు నిం
పునఁ బొగడంగ దానగుణభూషణుఁ డంచు నవంతినాయకుం
డనుదినమున్ యశంబు దిశలం దలర న్మహి యేలె నెంతయున్. ౫౪

---

1. దేవబంధకహాదు 2. గుప్పిగంతు లేయుటచుమ్మీ. 3. దనకీర్తియువ్యాప్తియు. 4. చినఁ బలికించిన మెచ్చిం చిన నిట్లని నీవు నాకుఁ జెప్పకయిమ్మా.

క. ఆదికారణముగ నతనికి, సదృశం బగుగుణము నీకుఁ జాలదు భువిలోఁ
బొదలననిపెద్దతికంబులు, పొదపెట్టక[1] మగిడి పొమ్ము భోజనృపాలా. ౫౫

వ. అనుడు ననంతరంబ. ౫౬

శా. లగ్నం బీక్రియ విఘ్న మొందిన నిరాలాపంబుగా విస్మయో
ద్విగ్నస్వాంతనృపాలపౌరహితవందివ్రాత మీక్షింపఁగా
భగ్నోత్సాహమనోరథుం డగుచు భూపాలుండు లజ్జాభరా
భుగ్నాస్యాంబుజుఁ డేచు నింటి కరిగెం బుణ్యం బగణ్యంబుగన్. ౫౭

వ. అంతఁ గొంతకాలంబున. ౫౮

—◆ రెండవబొమ్మకథ ◆—

క. మొలఁ బులితోలును మేనం, బలుచని వెలిపూఁత యఱుతఁ బాములపేరుం
దల మిన్నేఱు జడలను, జలివెలుఁగుం గలుగు మేటిజంగముఁ గొలుతున్.

సీ. అనుచుఁ గడంకతో నాభోజతిలకుండు దివ్యాసనం బెక్కఁ దివిరి మఱియు
ఫలకుసుమాదిశుభద్రవ్యములు గూర్చి సర్వపూజలుఁ దొంటిజాడఁ జేసి
కవిరాజభూసుర గాయకపాఠక నర్తకులును దనకీర్తి పొగడఁ
బసిఁడిగిన్నియలు చేపట్టి పుణ్యస్త్రీలు శిరమున మౌక్తికశేష లిడఁగ
ఖడ్గహస్తుఁ డగుచుఁ గదలి నృపాసనప్రాంతభూమి చేరె గ్రహబలంబు
గలుగువేళఁ బూర్ణఘటికాంతనాదంబు, చెవుల సోఁకినంత శీఘ్రగతిని. ౬౦

క. శింజాయితమంజీర, వ్యంజితనీలాంశుభృంగ మగు పదకంజం
బంజక యిడఁగా వేళా, భంజని[2] యై యచట సాలభంజిక పలికెన్. ౬౧

క. ఓహో భూవర వలవని, హాహూలివి[3] యేల విక్రమార్కునిసరిగా
సాహసమును గంభీరో, త్సాహంబును లేక యెక్కఁ దరమే నీకున్. ౬౨

గీ. అనుడు నిలిచి భోజుఁ డాత్మగుణంబులు, చెప్పఁ జూచి మొదలితప్పుఁ దలఁచి
మాని నాఁటిబొమ్మపూనిక నీవును, దప్పకుండఁ జెప్పు తద్గుణములు. ౬౩

క. అనవుడు నది యిట్లను నీ, గొనములు గలనృపులఁ బేరుకొని చెప్పం జూ
చిన జగమున నుజ్జయినీ, మనుజేంద్రుఁడుగాక యితరమనుజుఁడు గలఁడే.

క. శుభలక్షణుఁడు వదాన్యుం, డభయుం డీఁకఁ గలుగ నేర్చునయ్య "నభూతో
నభవిష్యతి" యనుపలు కా, ప్రభునకు సరిచెప్పుచోటఁ బలుకఁగవచ్చున్.

శా. ధారానాథ యనాథసస్యములకున్ ధారాజధారాధరా
కారుం డై కరుణామృతంబు గురియంగాఁ బ్రాజ్యసామ్రాజ్యల

1. పొదవెట్టక-శర. 2. భంజిక-చిన్నయసూరి. 3. వలదుసుమాహూలివి. యాహూలివి-చిన్నయసూరి.

క్ష్మీరూఢిం జగ మెల్ల నుల్లసిలఁగా శ్రీవిక్రమార్కాఖ్యుఁ డు
ర్వీరామారమణుండు కీర్తిఁ బరఁగెన్ వీరుం డుదారుం డనన్. ౬౬

మత్తకోకిల. అమ్మహీశుఁడు నాఁడునాఁటికి నాత్మభూముల నన్యదే
శమ్ములందుల వార్తలం బరిచారకు ల్విని పింపఁగా
నిమ్ముతోడ నవంతిపట్టణ మేలుచుండఁగ దూరదే
శమ్ము వార్త లెఱుంగఁబోయినచారు లిద్దఱు వచ్చినన్. ౬౭

ఉ. అచ్చటివార్త లెల్లఁ దెలియ న్విని వారల నాదరించి మీ
రిచ్చటి కేగుదెంచునెడ నీనడుమన్ గిరులందుఁ గానలం
దచ్చెరు వేమి గంటి రని యానతి యిచ్చిన నందులోన న
య్యచ్చ యెఱింగి యొక్కఁడు నరేంద్రున కి ట్లనియె న్వినీతుఁడై. ౬౮

సీ. చిత్రకూటాద్రిపైఁ జిత్రంబు గనుఁగొంటి నచటి బిల్వద్రుమప్రచుర మైన
పుణ్యతపోవనంబున రత్నకాంచనమయ మైన దేవతాలయము గలదు
లోకైకవంద్య మందాకినీజలధార తోరమై ముందటఁ దొరఁగుచుండు
నానీరు శుద్ధమై నమృతంబుననఁ బోలుఁ బాపిపైఁ గాటుకభంగిఁ దోఁచు[1]
దానిపొంత నొకఁడు మౌనియై జపముతోఁ, బాయకుండ వేల్మి సేయుచుండు
నతని కెన్ని యేఁడు లరిగెనో యెలికిన, హైమధూళి హిమనగోన్నతంబు.

మ. అనిచోద్యంబుగఁ జెప్పిన న్విని తదీయాలోకనోత్సాహియై
మనుజేంద్రుండును దిగ్గనం గదలి రమ్యా చూత మావకాని పా[2]
వనతీర్థం బని వానిఁ దోడుకొని భాస్వత్ఖడ్గసాహాయ్యుఁ డై
చనియెం గ్రూరమృగప్రచారతరువిస్తారంబులం దూఱుచున్. ౭౦

వ. ఇట్టి దుర్గమమార్గంబునం జనుదెంచుచు నొక్కయెడ. ౭౧

ఉ. భూరమణుండు గాంచె నతిభూరిపయోధరఘాట మాత్మవి
స్తారపునఃప్రరూఢపటుశాఖమహావటజూట మంచితో
ర్వీరుహసంభృతైకమునివీరకృతోటజవాటము న్మనో
సీరమణిప్రభాపటలచిత్రితకూటముఁ[3] జిత్రకూటమున్. ౭౨

సీ. అందులతీఁగె లింద్రాంగణాగములతోఁ జెలిమి సేయుచు మిన్ను గలయఁబ్రాఁకు
నందుల న్ప్రాఁకులు నందనవనకల్పతరువులతోఁ గూడి పెరుఁగుచుండు

1. శుద్ధన కమృతమై పొలుపారుఁ బాపికిఁగాటుకభంగిఁదోఁచు-అనీరు పుణ్యుల కమృతంబువలెనుం డు-చిన్నయసూరి. 2. చూత మాదివ్యపావన 3. చిత్రవనాటము.

నందుల క్రొవ్విరు లన్నదమ్ములమాడ్కిఁ జుక్కలవాసన కిక్కసేయు
నందుల సెలయేఱు లాకాశగంగతో నటనలు సలుపుచు నాడుచుండు
నందుల మెలఁగు కరు లైరావతముఁదాముఁ, గదుపుగట్టిమేసి మదము గురియు
నందుఁ గలుగు మౌను లాసప్తమునులతో, నిత్యసత్యగోష్ఠి నిలుతు రచట.

ఉ. అందుల నొక్కచో జలకమాడుచునుండఁగఁ దొల్లి మేదినీ
నందనవక్త్రవేణినయనస్తనకాంతులు జాతిపూవులై
యిం దుదయించె నాఁగ నుతికెక్కుచుఁ బెక్కుదినంబు లంబుజేం[1]
దిందిరమీనచక్రములు దేలుచునుండు సరోవరంబులన్. ౭౪

క. వివిధద్వాదశరాసులు, దవిలి తిరిగి పాళ్లసంపదలు చేకుఱమి
న్నవరత్నరాసులకునై, నవగ్రహంబులుం దదంగణంబులఁ బొలయున్. ౭౫

క. వింతలుగా నగ్గిరిపొడ, వింతం తని చెప్ప నలవి యే వెన్నెలఁ ద
త్ప్రాంతంబునఁ గరఁగినశశి,కాంతంబులు చంద్రకందు గడుగుచునుండున్.

సీ. శిరమున విమలపుష్కరవతి యగుమాల్యవతి రత్నమాలికావతి యనంగ
మృగపాదఘట్టన మృదులమౌజేగుఱుధూళి శేఖరితసిందూర మనఁగఁ
బ్రబలసమీరణోత్పతితంబు లైన పుష్పంబులు కరశీకరంబు లనఁగ
సర్వతోముఖసముచ్చాలనవారి[2]నిర్ఝరములు మదజలస్రావ మనఁగఁ
దన్నుఁ జేరినమేఘముల్ మన్ననంగ[3], సాలతరువులు బర్హధ్వజము లనంగ
నేచినీరాజ్యపట్టగజేంద్రులీల[4], నిలిచిపొలుచునయ్యచలంబునృపతియొక్కె.[5]

శా. లంకేశారిపదాంకితంబులు ఝరాలంకారకూలంకషల్
పంకేజాకరసంకులాంతరములం బ్రవ్యక్త దివ్యాంగనా
సంకేతంబులు మీనకేతనధనుష్టంకారశంకావహా
ఝంకారాళికులంబులుం గల మహాశైలస్థలుల్ చూచుచున్. ౭౮

క. ధారాధరమార్గాగత,ధారాళం బగుచు ధరణిధరమధ్యకృతా
ధారం బై ధరఁ బరఁగిన, ధారాతీర్థంబు గనియె ధారాధీశా. ౭౯

వ. కనిన నితని మనఃప్రసాదంబు దట్టం బై నిలిచె. ౮౦

క. దుర్గార్జునకైన మహా,ధర్మస్థలి నాత్మశుద్ధి దలకొను ననఁగా
ధర్మంబుల కాకరమా, నిర్మలునకుఁ జిత్తశుద్ధి నిలుచుట యరుదే. ౮౧

1. నుతికెక్కుదినంబులయందు నంబుజేం 2. చ్చాలనలోలి 3. పన్ననంగ. 4. ఉజ్జయినిరాజు పట్టగజేంద్రలీల-ఈపాఠము యతిచెడినది. 5. ఇక్కడ వ. "అచటఁ దెరువుఁజూపుచు మావంతు క్రియాహారుండు చూపమున్న గానతండు చని చని" అని యొకదానిలోఁగలదు.

భుజంగప్రయాతము. అతం డంత సుస్నాతుఁ డై రత్న హేమాం
చితం బై సువర్ణాద్రి చెల్వొంది దేవా
న్వితం బైన హర్మ్యంబు వే సొచ్చి యాదే
వతం గాంచి పూజించి వచ్చె న్నతుం డై. ౮౩

గీ. అచటిహోమశాల కరిగి వహ్నానంబునఁ, దపము కలిమిదోఁప జపముతోడ[1]
మధురయుతములైన మారేడుఁబండుల, వేల్మి సేయుచున్న విప్రుఁ జూచి.

గీ. అన్నపుష్పఫలజలాక్షతాదులు చేత,నున్నవాఁడును[2] జపహోమములను
జేయువాఁడుఁ బ్రణతిసేయఁదగరుగాన,[3] మనుజవిభుఁడు మ్రొక్కమానిపలికె.

క. ఓవిప్రోత్తమ సవనం,[4]బీవెరవున జరుగ నెన్ని యేఁడులు చనియె
న్నావుడు నుబ్బస పుచ్చుచు, నావిధిచేతలకు నేమి యనఁగల దధిపా. ౮౬

ఉ. ఇచ్చట నేండ్లు నూఱు సనియెఁ జగదంబిక నాయవస్థను
న్మెచ్చదు కూడు మాని రవి మీఁదఁ దపింపఁగ వేల్మి సేసి ము
చ్చిచ్చున వెచ్చుచుండి తెగఁ జిక్కితి నన్నఁ; గృపానువృత్తిఁ దా
నచ్చటివాని లేపి విహితాసనుఁడై నృపుఁ డాత్మనిష్ఠతోఁ. ౮౭

క. వ్యాలోలకరాళకజిహ్వాలం బగు సప్తజిహ్వవదనంబున భూ
పాలుఁడు మధుమిశ్రిత మగు, మాలూరఫలంబు వేల్చె మాత్రముకోలఁదిఁ.

వ. అట్లు హోమంబు గావించిన నయ్యుమ నెమ్మనంబున నన్నిక పొడమి పొడ
సూపకున్నం గడచూపునం గెంపుగదుర మద్గం బదరి దొరకొన్న కర్జం బుజ్జ
గించుట యుజ్జగంబున నొజ్జల లజ్జ లుడు[redacted]నుచు నుజ్జయినితేఁడు మారే
డుఁబండు మాని తన మెడం జూ[redacted] ౮౮

గీ. పలుకుఁదేనియ గలతలప[redacted]వ్వఁ, దలఁచి తలచిక్కు చక్కనిమీఁదటికిఁ[5] జెఱవి
యెడమ కేలఁ దెమల్చుచునడద మొత్తి, మఱుఁగుమిడుఁగుఱు లెగయగా మెడకుఁబూనె.

వ. ఇట్లు పూని యుంకించిన. ౯౦

క. ఓహో నృప నీధర్మో,త్సాహములకు మెచ్చితిని నిజం బిది యిఁక నీ
సాహసము విడువు మని త,ద్బాహాఖడ్గంబు పట్టెఁ బరమేశ్వరియుఁ. ౯౧

క. పట్టి నిలుచుండి నృప నీ, కిట్టిహితం బైన వేఁడు మిచ్చెద నని చే
పట్టిన మ్రొక్కి మహీవరుఁ, డి ట్టనియెం దల్లి మెచ్చి తిట్టులు నన్నుఁ. ౯౨

1. ఘనతపోవిభూతికలిమి మెఱసి 2. నున్నతనికిని 3. జేయునతనికి నతి చేయఁదగదుగాన
4. హవనంబీవెరవున......,నావుడునుబుస్సగొట్టుచు-చిన్న యనగారి, 5. చెక్కు-మీఁదటికి.

మ. ఇతఁడు స్నానము సంధ్యయున్ జపము ని త్రైకాలముం జేయఁగా
శతవర్షంబులు పోయె నీద్విజుని మెచ్చం జెల్లదో మెచ్చుసం
గతి గాదో గుణ మానతి మ్మనిన నో క్ష్మాపాల యీదుస్తర
వ్రతము ల్గల్గియుఁ జంచలంబు మతి భావం బల్ప మెప్పట్టునన్. ౯౩

గీ. మేరుశైలశిఖర మేఘలంఘితమున, నాఁగు నీవ్రతంబు నగణితంబు[1]
చంచలాత్మకృతము సంకల్పరహితంబు, నైన జపము లెల్ల హానిఁ బొందు. ౯౪

క. దేవర భువిఁ గాష్ఠంబున, గ్రావంబునఁ గాంచనమునఁ గలుగఁడు శుచియౌ
భావమునఁ గలుగనేర్చును, భావజ్ఞా భావశుద్ధి పరమార్థ మనన్.[2] ౯౫

క. డెందంబున సందేహము, నొందక ప్రహ్లాదుతండ్రి నొడఁబఱిచెడుచో
నిందుఁ గలఁ డనినఁ గంబము,నం దుదయింపండె విష్ణుఁ డసురులు బెదరన్.

క. దేవద్విజమంత్రౌషధ, దైవజ్ఞాచార్యతీర్థగ్రహముల యెడన్
భావన యేవిధమున నా, నా వెరవున నచటి సిద్ధి యగునిద్ధగతిన్.[3] ౯౭

గీ. భావ మస్థిరంబు గావున నీనివ్ర, తంబు లెల్ల నిష్ఫలంబు లయ్యె
నీవు నిష్ఠ నిట్లు గావించితివి గాన, గడియలోన మెచ్చు గలిగె నీకు. ౯౮

క. ధన్యుఁడ వనవుడు విని స, త్కన్యాదానమును దేవతావరమును రా
జన్యవరాజ్ఞయుఁ దిరుగుట, యన్యాయము గానఁ దిరుగ కంబిక వినుమా. ౯౯

ఉ. ఇష్టము లెల్ల నాకుఁ దగ నిచ్చెద నంటివి సర్వము న్వ్రత
భ్రష్టుఁడు నాక వీనికిఁ గృపామతి నిమ్మని మ్రొక్కినంత సం
తుష్టి వహించి దేవత చతుశ్శతవత్సరభోగ్యమైన యు
త్కృష్టమహీపతిత్వమును దివ్యపదంబును నిచ్చె వానికిన్. ౧౦౦

క. వానికి ని ట్లిచ్చి ధరి,త్రీనాయకుఁ బరిణమించి దేవియు నంత
ర్ధానమ్ము నొందె విప్రుఁడు, నానృపు వెఱఁగంది పొగడి యరిగె నిజేచ్ఛన్.

శా. తత్సేవాఫలదర్శనంబున మహాత్మస్థాన విశ్రాంతిగా[4]
నుత్సాహంబును సాహసంబును బ్రతాపోదారభావంబు న[5]
త్యుత్సేకంబును భూషణాకృతులతో నొప్పారఁగా భూపతీ
వాత్సల్యంబున వచ్చె విక్రమయశోవర్ధిష్ణుఁ డుజ్జేనికిన్. ౧౦౨

వ. కావున నీ కిట్టి గుణంబులు సమకూరకునికి నెక్కొంజనదు పొమ్మనిన విని భోజుం

---

1. మేరుస మానమా, ఘనతపంబులౌనగణితమైన, 2. పరతత్త్వ మనన్. 3. నీదుక్రియన్.
4. దదధ్వవిశ్రాంతిగాఁ జిత్తమందుత్సా. 5. గర్వోత్సేకంబున

డును మనంబున నతనిం గొనియాడుచు నుద్విగ్నితలగ్నుండై[1] సిగ్గుపడుచుఁ
బూర్వద్వారగమనంబు మాని యపరద్వారగమనోత్సుకుం డగుచు నాఁటి
కద్దివ్యాసనం బెక్కరాకుండుట తెల్లంబుగా మొగంబు తెల్లంబడఁ దిరిగి చని మఱి
యొక్కనాఁడు. ౧౦౩

## మూఁడవబొమ్మకథ

క. ఉల్లోలదుగ్ధసాగర, కల్లోలకరాగ్రమందకంపితఫణభృ
ద్వల్లభమణిమయడోలా, వేల్లనసుఖలోలుఁ డైన వేల్పుం దలఁతున్. ౧౦౪

క. అని నియమంబున హితశా,కునికస్వరశాస్త్రవేదకోవిదయుతుఁ డై
యను వగుదినమున సింహా, సన మెక్కఁదలంచి భోజజనపతి చేరెన్. ౧౦౫

క. చేరిన నచ్చటిపుత్రిక, యారాజుం బలికె వాసవాసన మెక్కం
గోరుట జగ మెఱుఁగ మహా,దారిద్ర్యుఁడు క్రతువుసేయఁ దలఁచుటచుమ్మీ.

ఉ. ఆర్యులఁ గూర్చి నేఁడు శుభమైన ముహూర్తము చూచి వట్టిగాం
భీర్యము దోఁపఁగాఁ దగని పెద్దఱికం బిది యేల సన్నపుం
గార్యమె విక్రమార్కనృపుగద్దియయెక్కుట వానిఁబోల నౌ
దార్యము నీకుఁ గల్గినఁ బదం బిడు మోజగ భోజభూవరా. ౧౦౭

వ. అనుడు విస్మయమానమానసుం డై మానవేంద్రుం డాసింహాసనయానంబు
మాని యనుమానించి మీనరపతివితరణంబు లేతెఱం గెఱింగింపు మనిన నది
యిట్లనియె. ౧౦౮

సీ. బలమున నిజమునఁ బ్రాణరక్షణమున భీము భీమాగ్రజు భీమగురునిఁ
జెలువున సంకల్పసిద్ధిఁ దేజంబునఁ బద్మారిఁ బద్మజుఁ బద్మమిత్రు
శివభక్తిఁ గీర్తి విశిష్టదానంబున బాణు బాణారాతి బాణజనకు
నైశ్వర్యమున రతి నఖిలోత్సవస్ఫూర్తిఁ[2] గామసంహరుఁ గాముఁ గామసఖుని
నష్టభోగముల రణాటోపమున బుద్ధి, నింద్రు నింద్రతనయు నింద్రమంత్రిఁ
గ్రేణిసేయు ననుచు జాణలువొగడంగ,నవని యేలె విక్రమార్కవిభుఁడు. ౧౦౯

క. సాహసము జయము బల ము,త్సాహంబుఁ బరాక్రమంబు ధైర్యముఁ గలని
ర్మోహకుని దొరయునెడ సం,దేహించుచునుండు నాదిదేవుం డైనన్. ౧౧౦

క. నరుఁడు మగతనము నేర్పునఁ, బరఁగించెడుచోటఁ దోషపడుదురు సురలున్
ధర గొళ్లికునకుఁ దోడ్పడ, గరుడఁడు జక్రంబు హరియుఁ గలిగినభంగిన్. ౧౧౧

1. విఘ్నితాలంఘితకాలజ్ఞుండై 2. నఖిలలోకస్ఫూర్తి.

క. అనవుడు భోజుఁడు గౌళికుఁ, డనువానికి నెచట విష్ణుఁ డాయుధమును వా
హనమును దోడ్పడియెను నే,వినవలతుం జెప్పు మనిన వెస నిట్లనియెన్. ౧౧౨

గీ. తుంగసౌధశృంగసంగతాంబర మగుచుఁ, బూర్వభూమి నొక్కపురవరంబు
భజన కెక్కియున్న నిజమైనపేరిట, వెలసెఁ భువిఁ బ్రతాపవిషయ మనఁగ. ౧౧౩

వ. అట్టిపురంబున. ౧౧౪

క. సేనానికి నెన యనఁ బర, సేనాభంజకుఁడు గలిగె క్షితిపతి విష్వ
క్సేనారాధకుఁడు బృహ, త్సేనాఖ్యుఁడు బల్మి భీమసేనుఁడు వోలెన్. ౧౧౫

వ. ఆనరేంద్రునకు నానంవిని యనుసుందరియందు నయనానందంబుగా నొక్కనం
దన యుదయించె. ౧౧౬

క. ఆరాజతనూభవ క,న్యారత్నము మరుని మోహనాస్త్రముక్రియ నా
కారంబున నొప్పుచు ధర,లో రూఢికి నెక్కు నది సులోచన యనఁగన్. ౧౧౭

క. భూవలయంబున నుపమా,జీవన మగు వస్తు వేర్చి చెప్పెద మనఁగా
నా వెలఁది యవయవములకు, నేవియు సరిగాక యునికి నేమనవచ్చున్. ౧౧౮

సీ. మృదుపల్లవంబులు ముసురకయుండినఁ బదసరోజములసంపదలఁ బోలుఁ
గరికరంబులమేనఁ గర్కశభావంబు లేకయుండిన నూరులీలఁ బోలుఁ
జక్రవాకంబులు నడిసన్న రేయెల్లఁ బాయకుండినఁ జనుదోయిఁ బోలుఁ
జుక్కలఱేఁడు దా గ్రుక్కక పొంగక కందకుండిన ముఖకళలఁ బోలుఁ
జంచరీకచయము సంచలింపక కూడి, నిలిచెనేని కురుల చెలువుదాల్చుఁ
బువ్వుఁదీఁగె మొదలిమవ్వంబు దప్పక,ననిచెనేని మేనియనువుఁబడయు. ౧౧౯

మ. తనలావణ్య మగణ్యదర్పమయమై తారుణ్యపూర్ణంబుగా
ననవద్యద్యుతితోడ నానృపతికన్యారత్న మేరాజనం
దనుల న్మెచ్చక మీఁది మేడకడ గంధర్వాంగనావిభ్రమం
బున నుండెన్ మృదువస్త్రగంధసుమనోభూషాదిభోగంబులన్. ౧౨౦

సీ. తరుణి యీక్రియ మేడఁ దరలకుండుటయును దెలిసి గౌళికుఁ డనుధీరవిటుఁడు
చాయలయుక్కునఁ జక్రంబు గావించి కాష్ఠయంత్రంబున గరుడిఁ జేసి
తావిష్ణుఁడై మన్మథప్రధనమునకు మెఱపుగాఁ గస్తూరి మిగుల నలఁది
పసపువన్నియ పట్టువసనంబు గావించి తిరునామ మొప్పఁగాఁ దీర్చి కడఁక
నెక్కి కీలున వాహన మెగయఁజేసి, పవనపథమునఁ జనుదెంచి బాలమ్రోల
నిలిచి నేనిదె కృష్ణుఁడ నిన్నుఁ గూర్చి, వచ్చితిని నన్ను వరియింపు లచ్చికరణి.

చ. అనవుడు బాల విస్మయము హర్షము లజ్జయు నగ్గలింప నా
తని నట నుంచి యేగి తనతండ్రికి నట్టి తెఱం గెఱుంగఁ జె
ప్పిన నతఁడు ప్రియంబున నభీష్టము నేఁ డొనఁగూడఁబోలు నీ
కని చనుదెంచి యచ్చట గవాక్షముఖంబునఁ జూచి యుబ్బుచున్. ౧౨౨

క. చల్లనికొండకు గిరిజా,వల్లభుఁ డల్లుఁ డగునట్టిస పువునఁ దల్లీ
నల్లనిదేవర నీచే, నల్లుఁ డనఁగఁ గలిగె నేఁ గృతార్థుఁడనైతిన్. ౧౨౩

క. అమ్మా తడయక కైకొను, పొమ్మా యని యనుప నేగి పొలఁతుక యచటన్
నెమ్మి దళుకొత్తఁగాఁ దన, నెమ్మన మలరంగ నాతని న్వరియించెన్. ౧౨౪

ఉ. గౌళికుఁ డయ్యెడ న్సది విలాసము హాసముఁ గూడియాడఁగా
బాలిక నంతనంత మృదుభాషణభూషణ తోషణంబులం
గేలికిఁ జేర్చి లజ్జ కడకీ లెడలించుచు బుజ్జగించి పాం
చాలుని పోలిక న్సురతసౌఖ్యము తీపులు చూపె నేర్పునన్. ౧౨౫

ఉ. అజ్జలజాక్షియున్ హృదయమందునఁబుట్టినవానిపోరుచే
బుజ్జవ మియ్యకోలు గొనుపొందునఁ గూడిన నింపుగైకొనున్
సెజ్జకుఁ దాన చేరు రతిచేష్ట లెఱుంగఁగడంగు చెయ్వులన్
లజ్జయొకింత చేద్పడఁ జెలంగుఁ బెనంగు ననంగకేలినై. ౧౨౬

క. ఇటు నానాఁటికి నొయ్యనఁ, గుటిలాలక యలుకు దీర్చుకొనుచుం దనకాఁ
గిట నాదటఁ జెలఁగఁగ న, వ్విటుఁడు న్సురతుల గారవించుచుఁ దివుటన్.

సీ. అంగుష్ఠ మడుగు గుల్ఫాంతంబుఁ జిఱుదొడ జఘనంబు నాభి వక్షంబుఁ గుచము
భుజమూలములుగళంబును జెక్కు మోవియునయనముల్నుదురుముందలయుననఁగఁ
గలుగుచోటులఁ జంద్రకళలఁ బెంపునఁ జెక్కు నారోహణావరోహణము లెఱిఁగి
బీజమంత్రాక్షతవ్యాజహృద్భాషల [1]హృదయాదిమర్మంబులెక్కఁజేయు
సుఖముఖాంకనఖరచుంబనభూషణ,గ్రహణతాడనములఁ గదలఁబొడిచి
చిత్తశయను దెలిపి యుత్తానశాయిత,ముఖ్యసురతతంత్రములఁ గలంచె. ౧౨౮

క. మనసిజమర్మజ్ఞునితో, మనమలరఁగఁ బెనఁగి కరఁగె మానిని రతిసం
జనితసుఖంబున నెలపొడు,పునఁ గరఁగెడు చంద్రకాంతపుత్రికఁ బోలెన్.

శా. ఆజాడం గుచచక్రవాకరుచి పెంపారం దదీయాననాం
భోజాతప్రభ లుల్లసిల్లఁగ సముత్ఫుల్లాక్షి [2]మీనద్యుతుల్

1. దృగ్బాణముల్ హృదయాదిమర్మవాహికలఁజొనిపి 2. పెంపారంగ శుంభన్ముఖాంభోజంబు ల్వికసింపుచుం జెలఁగ నుత్ఫుల్లాక్షి.

రాజిల్లంగ సులోచనాసరసిలో రాయంచభంగిం గళా
భ్రాజిష్ణుం డగు గొల్లకుండు హరిరూపం బొంది క్రీడించుచున్. ౧౩౦

ఉ. ఇమ్ములఁ గొన్నియేండ్లు సుఖయింపఁగఁ దక్కినరాజులెల్లఁ జో
ద్యమ్ముగ నిట్టివార్త విని యచ్యుతుఁ డీతని యల్లుఁ డయ్యె[1] గ
ర్వమ్ములు మాని వీనిఁ గొలువం దగునంచు భయమ్ముతోఁ దురం
గమ్ములఁ గుంజరమ్ములను గన్యలఁ గప్పము లిచ్చి పంపఁగాన్. ౧౩౧

క. చేకొనుచు బృహత్సేనుఁడు, చేకొలఁదుల లోఁగు లెఱిఁగి క్షితిపాలకులం
జీకాకుపఱిచి భూములు, చేకొనఁగా నలఁగి తలఁగి సిగ్గున నొకచోన్[2] ౧౩౨

వ. అందఱుం గూడుకొని విచారించుచుం దమలోన. ౧౩౩

క. సమముగ దేశము లేలుచు, నమరిన మగకూడు గుడిచి యధమాధమభా
వముతోఁ బెక్కం డ్రొక్కని, సమరమునకుఁ బోకయునికి[3] చచ్చుట గాదే.

క. గణుతింప మానభంగ, వ్రణ మాజన్మంబు నెడ్డ వ్రయ్యలుసేయున్
రణమరణము శూరులకును, క్షణదుఃఖము మీఁద నధికసౌఖ్య మొనర్చున్.

గీ. మానహాని యైన మనత్రోవకంటెను,[4] బ్రాణహీన మైన పదము లేదు
వీనిచేత బాధ వెచ్చుటకంటెను, జక్రధరునిచేతఁ జచ్చుఁ టొప్పు. ౧౩౬

క. రావణకంసాదికర, క్షోవీరులఁ జంపి తన్నుఁ గూడఁగనిచ్చెం
గావున సమములు నల్లని, దేవరకోపములు నట్టిదేవరవరముల్. ౧౩౭

సీ. మున్నీటిపాపయు మున్నీటితేపయు నిల్లాలు నిల్లునై యెసఁగువానిఁ
బాములపగవాఁడుఁ బాములపగవాఁడుఁ దేరును బొన్నునై తేరువానిఁ
గలువలచుట్టంబుఁ గలువలవెట్టంబుఁ దనరెండుకన్నులై తనరువానిఁ
బూవింటివాఁడును బూవింటివాఁడును గారాపుసుతులుగాఁ[5] గలుగువాని
జోడులేనికంటిజోగికి జోడుగా, నున్నవానిఁ బెక్కు మన్నవాని
దల్లి దండ్రియైన నల్లనివేల్పును, గంట చెడనిముక్తి పంట గాదె. ౧౩౮

క. చొత్తము చత్తమనుచు ను,ద్వృత్తు లగుచుఁ దెగి ప్రతాపవిషయముపై దం
డెత్తి చనుదెంచినం గని, యత్తఱిఁ దా వెడలె నాబృహత్సేనుండున్. ౧౩౯

చ. వెడలి నిజాప్తసైన్యపరివేష్టితుఁ డై చని గర్వపాటవం
బడరఁగఁ బోరిపోరి బల మంతయుఁ జచ్చినఁ జిచ్చులోపలం

---

1. డీతని కల్లుఁడంచుగర్వ- 2. కైకొనుచు... క్షితిపాలురఁజీ, కాకుపడనడిచి భూములు, చేకొనఁదిలఁచుడు- నడచి- 3. జోరకయునికి 4. అవనిమానహానియగుత్రోవ- 5. గారాపుఁబట్టులై. గట్టియొట్టియొకలుగువాఁడు- చిన్నయసూరి.

బడి వడిఁ దూలివచ్చు శలభంబు తెఱంగున నోహటించి లో
పడక పురంబు సొచ్చి సుతపాలికి నాపద చెప్పి పుచ్చినన్. ౧౪౦
మ. అది యాత్మప్రియుఁ జేరి, దేవ ! మును ప్రహ్లాదుం గృపం గాచి యు
న్మదుఁ డౌ దైత్యునిఁ ద్రుంచి తీవు మొసలి న్సరించి యాయేన్గు నె
మ్మది రక్షించితి నేఁడు ని న్గొలువఁగా మాతండ్రి కిట్టి మహా
పద వచ్చెన్ రిపుసంఘముం దునిమి నీభర్తు న్భువి న్నిల్పవే. ౧౪౧
క. అని వేఁడుకొనిన వాఁడును,మనమున నిటు దలఁచెఁ దొల్లిమగతనమునఁ బూ
నినపూనిక విడిచిన నిఁక, వినువారలుఁ జూచువారు వికవిక నగరే. ౧౪౨
గీ. నాఁటిసాహసమున నిట్టిబోటిగలిగె, నేఁటితెంపున కొకవేల్పు నిల్వఁబడఁడె
యనుచుఁ జక్రంబుగై కొనియంత్రగరుడి,నెక్కిసూత్రంబుగదలించిమొగసివచ్చె.
వ. అట్టి వేళ నయ్యాదివిష్ణుండు- ౧౪౪
ఉ. గొళికుఁ డీ లైనేనియు జగంబు జనార్దనుఁ డీ లైె నంచు న
న్నాలముసేయుచుండుఁ దన యల్లుఁడ నేనని నమ్మియున్న భూ
పాలుఁడు చిక్కు భక్తిఁ దమప్రాణము లొప్పనసేయ నున్న య
న్నీలతలంపులుం బొలియు నే నటు పోవకయుండఁ బాడియే. ౧౪౫
క. అని చక్రము చే వెలుఁగఁగ, వినతాసుతునెక్కి వచ్చి విభుఁ డొప్పె సువ
ర్ణనగంబుమీఁద సౌదా,మినితోఁ జెలువొందు నీలమేఘము పోలెన్. ౧౪౬
మ. తనదివ్యప్రభ లీక్రియ[1] న్వెలుఁగఁగాఁ, దార్క్ష్యుండు పక్షాగ్రచా
లనవాతాహతితోన మేఘములు డొల్ల న్మిన్ను ముట్టంగ నే
పున దీపించుచు లీలఁ గోపమును రూపుం జూపి చక్రాహతి
న్వనజాక్షుండు నృపాలపంక్తి ననిపెన్ వైకుంఠసంప్రాప్తికిన్. ౧౪౭
వ. ఇట్లు చేసి తదనంతరంబ తజ్జయంబు విదితంబుసేయం బూని. ౧౪౮
ఉ. ధన్యజనానుకూలుఁ డగు దానవసంహరుఁ డొత్తె నబ్జమూ
ర్ధన్యము భక్తసద్గతివదాన్యము నిర్జితగర్జితోగ్రప
ర్జన్యము భిన్నభిన్నపరసైన్యము దిక్కరికర్ణకీర్ణకా
ఠిన్యము గొళికావనదృఢీకృతజన్యముఁ బాంచజన్యమున్. ౧౪౯
క. ఇటు వానిపేరుగా న,ప్పటి మగు జయ మిచ్చి చక్రధరుఁ డేగిన ను
ద్భటవృత్తి గొళికుఁడు న,చ్చట చని రణమండలమునఁ జచ్చిననృపులన్.౧౫౦

1. దనుజారాతియునీక్రియన్.

— ఇరువదితొమ్మిదవబొమ్మకథ —

క. అంభోధిశయను గమలా,రంభోగ్రప్రౌఢు నబ్జసంభవగురునిన్
జంభారివినుతగుణసం,రంభాటోపాంధహారకరాళజ్వాలిన్. ౬౬

మ. తనచిత్తాబ్జములోఁ దలంచి మఱియున్ ధాత్రీశుఁ డాపాకశా
సనుసింహాసన మెక్కవచ్చిన సముత్సాహంబు వారించి కాం
చనపాంచాలిక వక్త్రదానగుణవిస్తారంబున న్సాహసాం
కుని సాదృశ్యము నొందలేక యిది నీకుం జెల్లునే పార్థివా. ౬౭

క. ఆతనిదానము భువన,ఖ్యాతము సకలోపకారకారణము దయా
చాతుర్య*తుర్యవిధము,త్యాతతధనకనకసముదయాకరము భువిన్. ౬౮

క. త్యాగంబున సత్కీర్తియు, యోగంబున ముక్తిసతియు నుచితం బగును
ద్యోగంబున సంపదయును, భోగంబున సుందరియును బొందినఁ గూడున్.

క. అనుచును ద్యాగము యోగం,బును నుద్యోగంబు నిష్టభోగంబును బెం
పొనగూడఁ దగినకాలం,బున జరపుచు నవ్విభుండు భువి యేలంగన్. ౭౦

చ. ఉరగము లెల్ల శేషులు పయోనిధు లెల్ల సుధాబ్ధు లేఱు లం
బరనదు లద్రు లారజతపర్వతముల్ గ్రహము ల్సుధాకరు
ల్తరువులు కల్పవృక్షములు దైవతసంఘము లన్నియు న్మహే
శ్వరు లనఁ జెల్లె నెల్లెడల †సాహసభూమణికీర్తివర్తనన్. ౭౧

ఉ. అట్టిదినంబుల న్నృపులు నాశ్రితులుం గవితారసజ్ఞులుం
జుట్టలు మంత్రులుం దొరలు శూరులు వీరులుఁ గొల్చియుండఁగా
దిట్టతనంపుఁబ్రోక యనఁ దేఁకువ క్కెక్కి విదేశవర్తి యా
బట్టొకఁ డేగుదెంచి జనపాలశిఖామణిఁ గాంచి పెల్లుగన్. ౭౨

సీ. బ్రహ్మాయు వని రాజుఁ బ్రస్తుతిచేసి తదాజ్ఞ సుఖాసీనుఁ డై భజించి
కవితయు సర్వలక్షణపరిజ్ఞానంబు సత్యవాదమును ధీచాతురియును
జాగంబు శౌర్యంబు సరసోక్తియును నాఁగ నియ్యేడుగుణముల నెన్నఁబడ్డ
చండపుత్రుండఁ బ్రచండవాచాలుండఁ జండపురాణదీక్షాగురుండ
నవనిపాలు రెల్ల నరిగాఁపులట్ల నా, కిచ్చుధనము లెల్ల నియ్యకొనుచు
నుత్సవమునఁ దిరుగుచుండి యీజగములో, నినుమహాప్రదాతయనఁగ వింటి.

---

*చాతుర్యవిదితమదియ, †సాహసభూమణుఁ డుర్వి యేలఁగన్.

సీ. సత్కీర్తి పతికిని సత్కుక్షిలోపల భువనత్రయంబును బొదలుచుండు
గావున నింతకు నీవె తండ్రివి నీదుధనము యాచకులకుఁ దల్లి సుమ్ము
తమపితృధనము తేతఱి నైనఁ గైకొన్న నిది భాగ మని భువి నెన్నఁబడునె
తనకుటుంబముఁ బ్రోవఁదా నెంత ప్రియపడ్డ నతఁడు మహోదారుఁ డనఁగఁదగునె
తగదుగాని నీయుదారత్వ మే మని, పొగడవచ్చుఁ *దొంటిరంతు పొందెఁదలఁప
శమితకుజనతర్క జయరమాసంపర్క, విమతకైరవార్క విక్రమార్క. ౨౪

క. జలములు పైఁబడక మహా,నల మాఱును శౌర్యభూషణా నీకోపా
నలము రిపుసతులకన్నుల, జలములు గనియాఱునెంత సత్త్వం బిచటన్. ౨౫

క. కావున యశముఁ బ్రతాపము, నే వెరవునఁ బొగడఁ జెల్లు నెవ్వరి సరిగాఁ
గావింపవచ్చు దీనులఁ, గావం బ్రోవంగ నీవె కారణ మగుటన్. ౨౬

ఉ. దేవసమాన నిన్ను వినుతించుట వాంఛితసిద్ధి భూమిలో
నేవసుధేశు నీయెదుట నెన్నఁగవచ్చు మదీయజిహ్వ ల
జ్జావశ మై చలింప దిఁక సద్గుణముం దలఁ సద్గుణాఢ్యుఁ బ్ర
స్తావన చేయ నేరని యతం డతిమూఢుఁడు గానఁ జెప్పెదన్. ౨౭

గీ. విపులదుర్గ మైన వింధ్యపర్వతసీమఁ, జంద్రకాంతసౌధజాలరుచుల
రాజపురముతోడ రాయుచు నుంచిన, రత్నపురము నాఁ బురంబు గలదు ౨౮

క. ఒకటొకటికంటెఁ బొడవనఁ, బ్రకటముగా నచటిహర్మ్యపంక్తులు దివి ము
ట్టికలశభవుచే వింధ్యా, ద్రికిఁ గృతమున నైన కొఱఁతఁ దీర్చుచునుందుర్.

క. అందు జయసేనుఁ డనఁగఁ బు, రందరవైభవుఁడు †రాజరాజసనాథ్యం
డిందుధరభక్తినిరతుఁడు, వందిజనప్రియుఁడు మనుజవల్లభుఁ డుండున్. ౩౦

క. ఆనరనాయకు వేఁడిన, దీనులు ధనవంతు లగుచు దేశములోన
న్నానవనాథులక్రియ నతి,దానంబులఁ బరఁగుదురు ప్రదాత లనంగన్. ౩౧

సీ. అట్టివిజయసేనుఁ డధికసంపత్తితో నొకనాఁడు నవవసంతోత్సవంబు
సేయ నుద్యోగించె నాయవసరమునఁ గవులును బట్లును గాయకులును
నర్తకులును నిజకీర్తి నుతించుచు సరసభావంబున సరస నడువఁ
జెలువార వారకాంతలు సుగంధద్రవ్యహస్త లై కెలఁకుల నరుగుదేర
దొరలు లెంకలు హితులు మంత్రులును గొలువ, నశ్వరత్నము నెక్కి యుద్యానభూమి
కేగి యచ్చట నొకపొదరింటిప్రక్కన, సుమచిరంబుగ మాకందతరువుక్రింద. ౩౨

* తొంటిపొందెతలప. † రాజరాజౌదార్యం.

శా. అర్పింపందగు పూజ లెల్లఁ దగుమర్యాద న్సమర్పించి కం
దర్పుం దత్ప్రియమిత్రుని న్సముచితోత్సాహంబునం గొల్చి యే
కార్పణ్యంబును లేక యింపెసఁగఁగాఁ గాశ్మీరకస్తూరికా
కర్పూరాదివసంతఖేలనములుం గావించె నుల్లాసి యై. ౧౩

క. జనవరుఁ డయ్యుత్సవమున, మనమలరఁగ యాచకులకు మాడలు పదివే
లును దొమ్మిదిలక్షలు గ్రక్కున నిచ్చెం గీర్తి దిశలఁ గొనసాఁగంగన్. ౧౪

వ. ఆసమయంబున- ౧౫

ఉ. యాచకకల్పభూజ మగు నానరనాథు మహావదాన్యునిం
జూచితి వానిచేత నిలు చూఱలు గొన్నగతి న్సువస్తువు
ల్వాచతురత్వచిహ్నములునాఁ గయికొంటి నతండు ధాత్రిలో
రాచగొనంబులం బగఁగురా జవుఁ గావున నెన్న నొప్పగున్. ౧౬

ఉ. అంచు నతండు రత్నపురియందలి మండలనాథచంద్రు వ
ర్ణించిన నయ్యవంతిధరణీధరుఁ డాతని చాగ మాత్మలోఁ
గొంచెముగాఁ దలంచి *నిజకోశగృహాధిపుఁ డైన లెంక నీ
క్షించి యనంతదానగుణశీలసమగ్రత †నత్యుదారుఁడై. ౧౭

చ. ఇతని కనర్ఘరత్నములయిండ్లుఁ గాంచనమందిరంబులుం
జతురతురంగసద్మములు సామజశాలలు నూపురాద్యలం
కృతిసదనంబులు న్వసనగేహములుం బరిపాటిఁజూపు న
మ్మత మగువస్తుజాతము సమస్తమునుం గొనిపోవని మ్మటన్. ౧౮

క. అనవుఁడు భాండాగారికుఁ, డును విస్మయమందుచుం గడుం బ్రియ మడరం
దనలోన వెఱఁగుపడ నా, తనిఁ దోడ్కొని యరిగి వరుసఁ దద్గృహములలోన్.

వ మదశుకానుకృతంబు లగు మరకతంబులు ను, బరిపుష్పరాగంబు లగు పుష్పరాగంబులు ను, ధామాధికంబు లగు గోమేధికంబులు ను, ప్రభాసఫలంబు లగు ముక్తాఫలంబులును, విడంబితబాలప్రవాళంబు లగు ప్రవాళంబులును, సదృష్టవైదూర్యంబు లగు వైదూర్యంబులును, యమునానీరనీలంబు లగు నీలంబులును, రుచిరీజితవజ్రంబు లగు వజ్రంబులును, గల్పితపద్మరాగంబు లగు పద్మరాగంబులును, నవధీరితమేరుశిఖరంబు లగు కనకశిఖరంబులు ను, నధరీకృతార్కభాజు లగు తేజులు ను, నుపమితదిగ్గజంబు లగు

* నిజకోశగృహస్థితుఁ డైన- † సత్యుదగ్రుఁడై.

మత్తగజంబులు ను, గర్జి కారసువర్ణాకారంబు లగు సువర్ణాలంకారంబులును, నానాంశుకంబు లగు చీనాంశుకంబులు ను, గనుపట్టం జూపిన నవ్వొందివరుండు నివ్వెఱంగంది తత్త్యాగసంపదలకుం గంపితశిరస్కుం డై యుండుందన కావటం బగువానిం గొనిపోవం దలంచి. ౯౦

క. అనుచరులచేత మణులును, గనకము మూటలుగఁ ద్వ్రష్టఁ గట్టించి నృపా
లుని గర్జని మీఱితి వని, కొనియాడుచు నర్థ మెల్లఁ గొనుచుం జనియెన్.

ఉ. ఆతఁడు చన్నపిమ్మటఁ దదర్థగృహస్థితుఁ డైన లెంక సం
ప్రీతమనస్కుఁ డై నృపుని పెంపు మనంబున సన్నుతించుచు
న్నీతియు భీతియుం గలుగ నేరుపు చొప్పడ విన్నవించె న
త్యాతత మైన యాజ్ఞ వినయంబునఁ జేతులు మోడ్చి నమ్రుఁడై ౯౨

క. తనియంగఁ బట్టుకొనిపో, యినయర్థము కొలఁది మీఱు నెఱుఁగఁగవలయు
న్ననిపించెద ననవుడు న,మ్మనుజేంద్రుఁడు చులుకఁ జూచి మందస్మితుఁడై.

క. చనువాఁ డని నే నిచ్చిన, చనవునఁ గొని చన్నధనము సంఖ్య యెఱుఁగం
బని లే దిఁక నాయర్థము, కొనియేగినవాఁడె యెఱిఁగికొన్నం జాలున్. ౯౪

సీ. అనుడు నాలెంకయు నాశ్చర్యమందుచు ధరణీశ నీకు నుదారమతికి
నిప్పటియోఁటి యొప్పు న ట్లయ్యును బలికెద నా విన్నపంబు వినుము
పయి లెక్కకాండ్రను గయికొల్పి వెలపించి లెంక విశ్వాసంబు బొంకుచేసి
ధన మెంత గల్గినఁ దాఁ జల్లఁజూడక యాయవ్యయంబుల నడుగవలయు
వాని వివరమెల్ల వర్గపుగాఁ గూర్చి, నెఱయఁ దెలుపు లెక్క లెఱుఁగుకొనుచు
వ్యయముపుచ్చి నిలువ వ్రాయించి కైకొంట, ప్రభుల కిదియ నీతివిభవమండ్రు.

గీ. వ్రాఁతకాని నమ్మరా దర్థగృహముల, నుంచకున్న నేమి యొక్కనాఁడె
వెరసు గూడుమనినఁ గరణము పండిత, న్యాయమునఁ గనర్థము చటఁ దెచ్చు.

క. ఒకదెసఁ దెచ్చిన యాయం, బొకదిక్కునఁ జెల్లువ్రాసి యొకదెసవ్యయ మ
ట్లొకదిక్కునఁ జనవ్రాసినఁ, బ్రకటంబుగ వాఁడు మిగులఁ బాపాత్ముఁడగున్.

క. వహి వారణాసి యనఁగా, మహిఁబరఁగిన దిండుఁ గపటమార్గంబుగ నా
గ్రహమున వ్రాసినవానికి, నిహపరములు లేవు నరక మెదురై యుండున్.

గీ. రాని పైఁడి చెల్లువ్రాయుట యాయంబు, తక్కునై వ్యయం బదెక్కుడౌట
లెక్క తుదుపువడుట లిపి సందియం బౌట, చెల్లు మఱచుటయును గల్లవనులు.

క. కరణము తనయేలిక కుప,కరణము నిర్ణయగుణాధికరణము ప్రజకు
న్నరణము పగవారలకును, మరణము నాఁ జెల్లు నీతిమంతుం డైనన్. ౯౯

ఉ. వ్రాలకు సందియంబువడ వ్రాయక మోసము పుట్టనీక గ
ర్వాలసుఁడై సుఖిం బడక యప్పటికప్పటి కిష్టబుద్ధితో
నేలికచిత్తవృత్తిఁ జరియించుచు నుండియు నెద్దియైనఁ ద
త్కాల మెఱింగి చేయునది కార్యము రాజహితాధికారికిన్. ౧౦౦

క. అధికారము గైకొని బహు,విధముల నాయమును వ్యయము వినిపింపక యే
యధికారి యడఁచె మఱివాఁ, డధికారియకాక పతికి నాప్తుం డగునా.

క. కావున నియ్యెడ నను హిత, సేవకునింగాఁ దలంచి చిత్తములోనన్
భావించినయట్లైనను, నావిన్నప మవధరింపు నరలోకేంద్రా. ౧౦౨

వ. అట్లు కాదేని యెత్తువెరసైన నవధరింపు మని మ్రొక్కి యోవబాన్యశిరో
మణి బట్టు పట్టుకొని చన్న రత్నధనస్వర్ణసంఖ్య చూచిన నేఁబదికోట్లు నటు
వదిలక్ష లయ్యె నవిన నుల్లంబున సంతసిల్లి. ౧౦౩

క. తెలియఁగల దొకటి నిను నా, సెలవున నతఁ డర్థ మట్లు చేకొని చనియె
న్వల దనుచు నడ్డపెట్టక, నిలుపక పంపినది చాలు నీపని యొప్పన్. ౧౦౪

మ. అనినం గ్రమ్మఱ మ్రొక్కి వాఁడు నరలోకాధీశ నీయాజ్ఞఁ గాం
చనరత్నాంచితశేఖరంబు కరణి న్సర్వక్షమాధీశులు
న్వినయానమ్రశిరస్కులై శిరముల న్విఖ్యాతిగాఁ దాల్చి నీ
పనివారై నెగడంగ నీ సెలవుఁ దప్పంజేయ నే నెవ్వఁడన్. ౧౦౫

క. ఎత్తఱినైనను బతి దన, చిత్తగతిం దగవు మీఱి చెప్పిన పని మా
ఱుత్తర మీయక చేసిన, నుత్తమసేవకుఁడు వాఁడె యుర్వీరమణా. ౧౦౬

చ. పనిచినఁ *బోనివాఁ డొకఁడు, పంచినఁ దా నొరుఁ బంచు నొక్కరుం,
†డను విది గా దటంచు నెదురాడు నొకం, డొకఁ డొంటిఁ బోవరా
దను, నొకఁ డప్పు రోగిసను, నాపని గాదను నొక్కరుండు, పా
మ్మనఁగఁ జలించు నొక్కఁడు, జనాధిప ‡యేడ్వురుఁ గష్టసేవకుల్. ౧౦౭

గీ. ఆజ్ఞదప్పుట పతి యాయువు దరవుట, కాన నర్థమెంత యైన నేఁడు
వోవుఁగాక యేను దేవరయానతి, దప్పఁజేయుదునె హితత్వ మేది. ౧౦౮

---

*బోయిరాఁడొకఁడు. †డనునిదిగాదటంచు. ‡యార్వురు. అని మూ.

వ. దేవ నీయానతి కనుగుణంబుగ నమూల్యరత్నాది సువస్తువు లెల్లను దాఁ
పురంబు చేయక చూపిన నతండు తన యిచ్చకొలందినె యవారితంబుగా
నింతధనంబు గొని చనియె ననిన మిక్కిలి సంతసిల్లి నవ్వుచు నాలెంకకు
లక్షధనంబు పసదనం బొసంగెఁ గావున ౧౦౯

క. నీకంత యీవి గలుగక, యీకడ నదు గిడఁ దరంబె యేగు మనిన నా
భూకాంతుని గుణము లుపశ్లోకించుచు నృపుఁడు మగిడి లోనికిఁ జనియెన్.

— ముప్పదియవబొమ్మకథ —

వ. మఱియు నొక్క శుభావసరంబున. ౧౧౧

క. నెఱయ మగతనము గలిగియు, నొఱపుగ జగములకు దల్లియుం దండ్రియు నా
నెఱుకపడ నొప్పమేనను, దెఱవయు మగవాఁడు నైన దేవరఁ దలఁతున్.

మ. అనుచు న్భోజనరేశ్వరుండు మఱియు న్యత్నంబున న్రత్నకీ
లనరమ్యం బగు నమ్మహాసనముపై లక్ష్మీకళాసుందరా
ననుఁ డై పాదసరోరుహం బిడ నెడ న్వారించి యాపాంతకాం
చనపాంచాలిక యిట్లను న్సరసవాచాలత్వ మేపారఁగన్. ౧౧౩

ఉ. భోజనరేశ్వరా మగిడి పోయెద నెప్పటి యట్ల క్రమ్మఱన్
రాజసవృత్తి నెక్క ననురాగము గైకొని వచ్చి తింతటం
దేజము గల్గునే వసుమతిం బ్రతి లేని వదాన్యవృత్తి మా
రా జగు విక్రమార్కు సరి గాక పదం బిడఁ జెల్ల దేరికిన్. ౧౧౪

క. అతని వదాన్యత్వము విన, మతిఁ బ్రియ మగు నేని వినుము *మందారము సం
తతదానశాలి యనఁ దగు, నతనికి సరి రాక వెలుక నై తలవాంచెన్. ౧౧౫

ఉ. దండితశత్రుమండలుఁడు దానగుణార్కసుతుండు వైభవా
ఖండలుఁ డార్తరక్షణనికామసముద్యతమానసుండు మా
ర్తాండసమానతేజుఁడు ప్రతాపసమగ్రభుజుండు మేదినీ
మండల మెల్ల నేలె గరిమంబున నబ్ధులు నాల్గు మేరగన్. ౧౧౬

క. సాహసభూషణుఁ డొకనాఁ, డీహితమునఁ దలఁచి నిశ్చయించి కలిమిచే
నైహికసుఖమగు ధర్మో, త్సాహమునఁ బరోక్షసుఖము సమకూరఁదగున్.

క. ఈరాజ్యంబున కిటుసం, సారసుఖం బొదవె జన్మసాఫల్యముగా
నేరీతి నైన ధర్మా, చారంబున నొందవలయు స్వర్గసుఖంబున్. ౧౧౮

---

*మందారము సం, తతమును సంతానముఁ దా, నతనికి,

మ. అనుచుం గల్పిత నిశ్చయుం డగు నకేంద్రాధీశు విత్తంబు వ
ర్తన మూహించి తదీయసన్మతికి నుత్సాహంబు రెట్టింప నొ
య్యనఁ దన్మంత్రివరుండు వల్కె నిరపాయస్వర్గసౌఖ్యంబు ని
కనుమానం బగునే యనంతసుకృతవ్యాపారసంచారికిన్. ౧౧౯

సీ. అతిథిసత్కారంబు నార్తరక్షణమును దానంబు దయయు సత్యవ్రతంబు
తఱచుగాఁ జేసినధర్మంబు తనతోడి నీడయై చనుదెంచుఁ దోడుగాఁగఁ
జిత్తంబు నానాఁటి చింతఁ గూరకమున్న యాత్మసంపదలు పొపఱకమున్న
ముదిమిచే సంధులు వదలకమున్న రోగంబున నొకకీడుఁ గాకమున్న
పుణ్యమార్జింపుఁ డవసరంబునకు మొదల
గట్టియాధనములు గూడఁబెట్టు టండ్రు
జీవ మెడలంగ సుకృత మార్జింపఁ జనుట
నిల్లు గాలంగ నుయి ద్రవ్వనేగు టండ్రు. ౧౨౦

క. ఈవచనం బితరులకొఱకై వినిపింపంగవలయు నది నీకడ స్వా
భావిక మైనది గావున, నీవెఱుఁగని యట్టి ధర్మనిరతులు గలవే. ౧౨౧

క. నావుడుఁ గడు మది నుత్సుకుఁడై విప్రులయుండ్లఁ గ్రతువు లనర్ఘము వనముల్
బావులు నూతులుఁ జెఱువులు, దేవస్థానములు నిలిపెఁ దేఁకువ కెక్కన్. ౧౨౨

ఉ. ఎక్కడఁ జూచినన్ సుకృత మిన్నిక క్కెక్కఁగఁ గీర్తిసంపద
ల్పెక్కువిధంబులన్ ధరణిఁ బెంపు వహింపఁగ నానరేశ్వరుం
డొక్కఁడె తీర్థసేవనసముత్సుకుఁడై పరివార మెల్ల న
ల్దిక్కులయందుఁ గొల్చి చనుదేరఁగ నర్మద కేగె సొంపుగన్. ౧౨౩

చ. కరితురగాదిసైన్యపరికల్పితమార్గనివేశుఁ డౌచు ద
వ్వరిగి యవంతినాథుఁడు నిరంతరవారివిహారశీలసుం
దరతరరాజహంససముదాయసమాహితశర్మద న్నిజ
స్మరణనివారితోన్నతభుజంగమదుర్మదఁ గాంచె నర్మదన్. ౧౨౪

క. కనుఁగొని కడుఁ బ్రియమున నెమ్మనమునఁ బ్రణమిల్లి యచటి మాంధాతృపురం
బున విడిసి యనుచరులుఁ దా, నును నదికిం జనియె నిజమనోరథ మలరన్. ౧౨౫

మ. చని యాతీర్థములో సచేలముగ సుస్నానంబు గావించి నూ
తనవస్త్రాభరణానులేపముల గాత్రం బుజ్జ్వలస్ఫూర్తిఁ గై
కొని రాజిల్లఁగ నిల్చి విప్రవరులన్ గోభూతిలార్థాది దా
ననిరూఢిం దనిపె న్రవిగ్రహణపుణ్యంబైన కాలంబునన్. ౧౨౬

క. ఓంకార యిచ్చను వెలువడి, శంకరుఁ గింకరముసేయ శంకరు నురగా
లంకారు నచట సిలిచిన, యోంకారేశ్వరునిఁ గొలిచె నుచితార్చనలన్.

మ. భువనాధీశ్వరు నిట్లు తత్పరమతిం బూజించి సేవించి త
ద్భవనప్రాంగణరత్నమండపములోఁ బర్యంతభూమీశులుం
గవులు న్భట్టులు గాననేతలు నలంకారజ్ఞులు న్మంత్రులు
న్యువతీస్తోమము లెంకలుం గొలువఁగా నుల్లాసియై యుండఁగన్. ౧౨౮

మ. ఒకనాఁ డౌళికుఁ డేగుదెంచి సభలో నుత్కృష్టహస్తాగ్రుఁడై
ప్రకటాశీర్వచనక్రమంబున నిజప్రౌఢత్వ మేపారఁగా
నకళాభిజ్ఞత చూపఁ బూని పలికెన్ స్వర్గాంత నీకీర్తికాం
తకు నీరేడుజగంబు లొక్కగుణిసౌధంబై వెలుంగుంగదా. ౧౨౯

ఉ. ఓనరనాథచంద్ర సుగుణోత్తమ యిచ్చట నాప్తవర్గముల్
దీనుల బట్లను న్ధరణిదేవతలం గవులం బ్రియోక్తి స
న్మానము లేర్పడంగ ననుమానము సేయక యాదరించు నీ
దానమహోత్సవంబు విని దవ్వులనుండి దె చూడవచ్చితిన్. ౧౩౦

గీ. అర్థినన్న మెత్తువటు గాక నేర్పరి, నన్న మెచ్చువడయు టవియ కడఁది
నేఁటి క్రొత్తవిద్య నేమెఱయించెద, నవసరంబు నాకు నానతిమ్ము. ౧౩౧

క. అనుడుఁ దదీయకళాదర్శనలాలసుఁ డగుచు నవసరం బిచ్చినఁ దా
నాని నామేళము గూర్చొని, పనివిని మొదలంచు వెడలిపోవఁగ నేగెన్. ౧౩౨

సీ. అయ్యెడ నొకక్రొత్తమైనమహావీరుఁ డొందియ డాకాల నమరఁ బూని
బాగుగాఁ బులిగోరు పట్టు దిండుగఁ గట్టి నునుపార మేనఁ జందన మలంది
తిలకంబు కస్తూరిఁ దిలకించి చొల్లెంబు చెంగులపాగతోఁ జెక్కు మీఱ
హనుమంతు వ్రాసిన యరిగెబిళ్లయు వాలుఁగరములజముదాడి గడలుకొనఁగ
నొకఁడువచ్చె వెనుక నొక్కబింబాధరి, యంచుముప్పటిముసుఁ గమరఁ బెట్టి
మేనికాంతి కప్పులోనఁ గ్రిక్కిరియంగ, హంసయానయగుచు నరుగుదేర.

క. *వచ్చి నృపుంగని మ్రొక్కిన, నచ్చో నొకమంత్రి యీమహావీరుఁడ నీ
వెచ్చోటనుండి సతితో, నిచ్చటి కరుదెంచినాఁడ వెవ్వఁడ వన్నన్. ౧౩౪

శా. †ఆవీరుండు వినీతుఁడై మనుజలోకాధీశుతో నిట్లనున్
దేవాధీశునిబంట నొక్కెడ బలోద్దీర్ణుండనై తత్ప్రాగిం

*వచ్చి పరిణమిల్లినిల్చిన, †ఆవీరుఁడు వినతుండై, భూవరుతో నిట్లు పలికెఁ జాలుపల రంగా- దేవతలుం దానవాసుల, తో వైరముపూని నన్నుఁ దోడ్పడఁదలఁచిర్.

గావింపం గని నన్ను హీనపడునిం గాఁజేసిన న్వచ్చినా
*నీనామేక్షణ నాదుభార్య యిట నాకిష్టంబుగా వచ్చితిన్. ౧౩౫

క. క్రమ్మఱ నింన్నఁడు రిపుసై, న్యమ్ములు పోరాడ వచ్చువవసర మని యు
ద్దమ్మునకుఁ దోడుపడ నను, రమ్మని పుత్తెంచె నిపుడు రాజవరేణ్యా. ౧౩౬

క. నే నరుగఁగ నక్కడ నా, దానవయుద్ధమున సుదతి దలఁకెడు నిట నే
మానవుఁడు హితుఁడు లేఁడటు, గాన సతికి నీవె ప్రాపుగాఁ దగునధిపా.

గీ. †పాలనంబు సేయుప్రభుఁడవు నీకంటె,నొండుచోట నుంచు టురవుగాదు
దిక్కులేనిప్రజకు దిక్కునీ వటుగానఁ, దరుణి నరసికొమ్ము తంద్రికరణి. ౧౩౮

క. అని యప్పగించి సభలో, వినువారలుఁ జూచువారు విస్మయమందన్
హనుమంతునొడ్డనముతో, హనుమంతుని వగిది నెగసె నాకపథమునకున్.

క. మిన్నంట నెగసి నరులకుఁ, గన్నంటిన యంతదవ్వఁ గానంబడి య
త్యున్నతగతిఁ గనుపట్టక, చన్నం గని చోద్య మందె జనపాలుండున్.

సీ. అనిమీఁద దేవాసురాహవం బైనట్లు పంచమహాశాద్యధ్వనితు లెసఁగెఁ
బొడుపుఁడు తలద్రెంచుఁడనుపుఁడు హానిల్లు పెడబొబ్బలార్పులుఁ మునులుపడియె
నంతలోపల హనుమంతునొడ్డనముతోఁ గూడ నాతని చేయిగూలె ధరణిఁ
దరువాత వాలుతో దక్షిణహస్తంబు నందియతోఁ గాలునట్లు పడియెఁ
దోడి కాలును దెగితొడఁగెఁ జెంగులపాగ,చొల్లియంబుతోనద్రెక్కేఁదలయుఁ
ద్రిండుతోడఁగూడ ‡మొండెయుడిగదొర్లెఁ,గొలువులోనఁజూడ ఘోరమయ్యె.

ఉ. ఎక్కడిమండిపచ్చె నితఁ డెవ్వఁడొ యింద్రునిబాట నంచుఁ దా
నిక్కమలాక్షి నుంచి దివి కేగి సురాసురసంగరంబులం
ద్రెక్కువ నొక్కఁ డిట్లు కడికండలునయ్యె నటంచుఁ గొల్వులోఁ
బెక్కువిధంబుల న్బటుని బేర్కొని విస్మయమంది రందఱున్. ౧౪౨

గీ. మీఁది మునుఁగుపచ్చి మెలఁతుక యలకలు, చక్కనుక్కయప్ప డక్కజముగ
నధిపునవమయంబు లామొడ్డనంబుతోఁ, గూడఁ దిగిచి బెగడుగొనరపలికె.

క. ఓనరనాయక యింకిట, నేనుండుట తగదు సమరనిహతుని వీరు
న్నానాథుఁగూడ నేగెద, నానతి యీవలయు నాకు నగ్నిసారంగన్. ౧౪౪

*ఈనా మేక్షణభార్యగా క్షితితలం బిష్టంబుగా వచ్చితిన్ †భారమెల్లమాన్పుప్రభుఁడవు- నొండుచోటఁగార్య మొండుపుట్టు- పాపమెల్లమాన్ప- ‡మండెములుదెర్లె- నెడయకాలును దెగి పుడమిబడియె. గుండెలమలు దెర్లె.

క. నాఁడని మొదలనె యాతని, చావున కతిఖిన్నుఁడైన జనపతి కృపతో
నో వీరపత్ని జనకుని, కైవడి నినుఁ బ్రోతు నిల్లుగడఁగకు మనియెన్. ౧౪౫

క. ఇది చాగెడుకొఱకై నీ, పదములకడ నుంచె నిన్ను పతి పోయిన ని
త్పదమున కేగెద ననుపుట, మదిఁ జూడఁగ నిదియె తండ్రి మన్నన గాదే.

ఉ. ఆకులపాటుతోడ నశుభాకృతినై యొకవేళనైనఁ బోఁ
కాకుడు లేక సొమ్ములకు నజ్జులు పాఁపక పేరఁటంబులం
బోక తొలంగి పూఁతలును బువ్వులు దూరముగాఁగ ముండనై
యేకడఁ జేరిన న్విధవ కెన్నటె కాక †తరింపవచ్చునే. ౧౪౭

క. చచ్చియుఁ జావక తనలో, నెచ్చుచు నియమముల నింక విధవాత్వమున
న్నిచ్చలు నూఁడుట కంటెను, జిచ్చుఱుకుట మేలు సతికి క్షితి మెచ్చంగన్.

క. పతి దుఃఖితుఁడైనను దా, నతిదుఃఖిత యగుచు మఱి యతఁ డరిగినఁ బీ
డిత యగుచు నతఁడు చచ్చిన, ధృతితోడన చచ్చునది పతివ్రత చుమ్మీ. ౧౪౯

గీ. పుట్టలోని పాముఁ బట్టి గారడికుండు, బలిమి వెడలఁ దిగుచు పగిది నింతి
తోడఁ జచ్చి పతి యథోగతుఁడైనఁ దా, నుద్ధరించి సౌఖ్య మొందుచుండు.

గీ. అతని కేమికొఱఁత పతి హితంబునఁ బ్రాణ, మిచ్చినాఁడు దివికి నేగినాఁడు
రమణుఁడగుచు నచట ‡రంభాదిసతులఁ గూ, డకమున్న ననుఁ గూడ ననుపు.

గీ. ఊరక మాన్పితేని యురి వెట్టుకొనియుండె, గుంట గట్టి నీళ్ళఁ గూలి యుండె
విషముఁ ద్రావి యుండె విడుతుఁ బ్రాణంబు లా, తగని చావు కీసు దగులు నిన్ను.

సీ. §అటుగాక పుణ్యమా నగ్నిప్రవేశంబు చేయింపు మాకీసు చెంద దిందు
నెన్న ముక్కోటియు నేఁబదిలక్షలు మానవు మేన రోమంబు లుండు
నన్ని యేఁడులు స్వర్గమున నాయకుతోడ ననుగతయౌ సతి యనుభవించు
వీరవియోగినై విధవనై యుండుట సముచితంబది గాదు చాగనిమ్ము
తడయనేల యనుచుఁ దగఁ బ్రార్థించిన, మాట నలుక లేక మనుజవిభుఁడు
కొంత యనుమతింప నంతలోఁ దజ్జను, లాయితంబు చేసి రాస్త లగును.

చ. ధృతి మతిఁ బొంగి రాజునకు దీవన లిచ్చి నిజాధినాథు మే
నితునకలుం దదస్త్రములు నించి ఘృతప్లుతచందనేంధనా
న్వితమగు నగ్నికుండమున నింతి వెస న్నవనీతపుత్రికా
కృతిఁ బడి యంతలోనఁ గరఁగెన్ జనులం దఱుఁ బ్రస్తుతింపఁగాన్. ౧౫౪

* ఆవీరభటుని చావునకై † చరింపవచ్చునే, భరింపవచ్చునే, ధరింపవచ్చునే.
‡ రంభాదిసతులను గూడకుండ- రంభాదులను గూడుకొనక మున్న- § అటుగాన యుక్తమా.

వ. తదనంతరంబ. ౧౫౫

క. వసుధేశుఁడు వెఱఁగందఁగ, వెస నరిగయు వాలు ద్రింపు విలసిల్లఁగ నా
కసమున డిగి యశ్వీరుఁడు, కసుగందకవచ్చి తోఁటికై పడి నిలిచెన్. ౧౫౬

ఉ. ఒక్కఁడు నిల్లు వచ్చి నిన యోక్కులు మున్నుగ మన్నుతేనికిన్
ప్రొక్కి సురప్రహూనముల మోహనమా నొకదండ యిచ్చి నే
నక్కడ కేగి దానవుల నందఱఁ ద్రోలినఁ జూచి మెచ్చుగా
నిక్కుసుమస్రజంబు దివిజేంద్రుఁడు నా కొసఁగెం బ్రియంబునన్. ౧౫౭

క. క్రమమున నయ్యింద్రుఁడు నా, కమరపదం బొసఁగి నిజసభాంతరమున ని
త్యమునుండఁగ వలయుఁగుటుం, బముఁదోడ్తో సరమ్ముటంచుఁ బనిచె న్నగుడన్.

క. ఆ రణమునఁ గ్రమ్మఱ, నీకడ కరుదెంచినాఁడ నిఁక నేగద నే
నీకప్పగించి పోయిన, నాకోమలి నిచ్చి మగుడ నన్నను పు నృపా. ౧౫౯

చ. అనవుడుఁ గొల్వులో నిజచు లందఱు మిక్కిలి చోద్యమందఁ గా
మనుజవరుండు వాని కొకమాటయు నాడఁగ రావు లేక వి
న్నన యగుచున్న మంత్రులు మనంబున విస్మితులయ్యె వీరుఁడా
యని మొన నీవు దీటిన మృగాక్షియుఁ జచ్చుటికె ప్రియంబునన్. ౧౬౦

మ. అనిన న్వారలఁ జూచి వాఁడు దివి నే నాదేవసంఘమ్ములు
న్ననుఁ జూడ న్రిపుసేనలం బఱపి మందారస్రజం బింద్రు మ
న్ననగాఁ గైకొని వచ్చినాఁడ నిట నున్నాఁడ న్ననుం దీటినాఁ
డనిన న్నెత్తురె రాచవారలకుఁ గల్గాడ న్ననం బొందునే. ౧౬౧

క. ప్రత్యక్షముగా నెదుర ను, సత్యము పలుకుదురు గాక చనువారు హితా
మాత్యులు నైమిారీతని, కృత్యము నడుపుదురు మిమ్ము గెలువం దరమే.

చ. అనుడు నిరుత్తరుం డగుచు నవ్వసుధేశుఁడు వానికంత నా
యనిమిషనాథునొండె మఱి యంతకు నైనఁ గలంచి తెత్తు నేఁ
డని మది నిశ్చయించుకొని యాత్మహితుం డగు లెంక చేతి కాం
చనమయముష్టిరమ్య మగు శస్త్రిక యల్లన యందె నందినన్. ౧౬౩

క. ఆవీరుం డప్పుడె నిజభావము ప్రకటముగ నాత్మభామినితోడం
డా వైతాళికుఁ డగుచుం, గైవారము సేసె జనులు గడు వెఱఁగందన్.

క. నరనాథ నిన్ను నవు డవ,సర మడిగినవాఁడ నైంద్రజాలికురీతి
న్నరుల నణకించి నీచే, సిరి వొందం జోద్యమిట్లు చేసితి ననియెన్.

గీ. అనుపమ వెలుఁగు వసుచు నవనీశుఁ డంతయు, నింద్రజాలము గుట్టు మెఱిఁగి యతని
గారవించి యెన్నికళల లక్ష్యపెంచితి, వన్ని నాకుఁ జెప్పు మనుచు నతఁడు.

గీ. పెక్కుకళ్య లెఱుఁగఁ బృథ్వీశ నినుఁ గొల్వ, నేర్తుఁ గొన్నికళలు నేర్తుఁ దొల్లి
వానిపేళ్లు వినఁగ వలయును జెప్పెద, జానసైన నన్నుఁ దద్జ్ఞుఁ డనరె.

వ. కావున నవధరింపుము నాలుగు వేదంబులు ను శిక్షాదిషడంగంబులు ను స్మృతులు ను బురాణంబులు ను బూర్వోత్తరమీమాంసలును న్యాయవిస్తారంబులు ను నితిహాసంబులు ను నాస్తికశాస్త్రంబు ను శ్రౌతతంత్రంబు ను నాయుర్వేదంబును ధనుర్వేదంబును విషప్రతీకారంబును మంత్రప్రతీకారంబును గణితంబును మాంత్రికత్వంబును జలసూత్రంబును సంగీతంబును సాహిత్యంబును నుచితకృత్యంబును నాటకంబులుఁ గావ్యంబులు నలంకారంబులు నానాదేశభాషలు ను సకలలిపిపరిచయంబు ను దూరగమనంబును దూరశ్రవణంబును ధురంధరత్వంబును, వశ్యాకర్షణాది షట్కర్మంబులును వాహనారోహణచాతురియు జలస్తంభన, శిలాస్తంభన, స్థలస్తంభన, అగ్నిస్తంభన, ఖడ్గస్తంభన, వాయుస్తంభన, రసస్తంభన, శుక్లస్తంభన, రక్తస్తంభనాదులును మహేంద్రజాలంబును, నష్టవస్తుసముద్ధరణంబును, జంతిశాస్త్రదానముష్టీకరణంబును బ్రియభాషణంబును సదృశ్యీకరణంబును నదృశ్యాకర్షణంబును కృషివాణిజ్యాదులును శక్తిత్రయంబును రత్నగర్భాది పరీక్షణంబును మనుష్యాది జీవపరిరక్షణంబును ద్యూతాదిఖేలనంబును యమనియమాద్యష్టాంగయోగంబును అష్టావధానంబును వైదికంబును లోకాచారంబు ను రతిరహస్యంబు ను వాద్యకౌశలంబు ను నాట్యంబును బరకాయప్రవేశంబును బరవంచనంబును, ఉపాయాపాయవివేకంబును వీరత్వంబును వాచకంబు ను గందుక కుక్కుటాండ జలపూర్ణభాండ చక్రభ్రమణంబు ను బహురూపనటనత్వంబును వేణుదండభ్రమణంబును రాజముఖ మృగముఖ స్త్రీముఖ చోరముఖ దిఙ్ముఖబంధనంబును హాలికప్రయోగంబు నాకారగుప్తియు భావజ్ఞానంబును గ్రామణికత్వంబును లేఖకత్వంబును బరిహాసంబును వాచాలకత్వంబును నిష్కంపవృత్తియు సర్వజాతి శిల్పపరిశీలనంబును నా నీచతుష్షష్టికళలయందును దేవరసాన్నిధ్యంబునం గొంత పరిచితుండ ననిన.*

క. భూవల్లభుఁ డాతని వి,ద్యావిజ్ఞానంబు మెచ్చి తనలోపల నం
భావింపఁ దలంచు నెడన్, దౌవారికుఁ డేగుదెంచి తగ నిట్లనియెన్.

---

* ఈవచనంబులోని చతుష్షష్టికళలను - ప్రతిలోని విధముగా మార్పఁబడినవి, సంఖ్య హెచ్చినది.

క. ఓనరనాయక తమకుం, బూనిక ఫలియింపఁ బాండ్యభూపతిమంత్రుల్
కానుకలు గొంచు దేవరఁ, గానం జనుదెంచివారు కడు వినయమునన్. ౧౨౦

గీ. అనిన వారిఁ దోడికొనిరమ్ము నావుడు, మగిడి యేగి యచటిమంత్రివరుల
వారు దోడకొనుచువచ్చిదర్శింపించెఁ, గరకరక్తి చేయుమనుమనుగాఁగ.

సీ. ఆమంత్రివరులు సాష్టాంగంబుగా మ్రొక్కి నిలిచి ముందరఁ గరంబులు మొగిడ్చి
జనలోకనాయక యెనిమిదికోట్లు దీనారములు *నూర్వురు వారసతులు
తొంబదిమూఁడు ముత్యంబుల†కావళ్లు నేఁబదినుత్తకరిండ్రములును
మున్నూఱు జవనాశ్వములును గప్పంబుగాఁ బాండ్యభూపాలుండు పంపెనీకు
నవధరించి దండయాత్ర యక్కడమాని, యతని గావవలయు ననుచు మ్రొక్కి
‡యున్నఁ గరుణఁజూచి యుర్వీశ్వరుండును, మోద మడర వారి నాదరించి.

ఉ. అర్థులు గోష్ఠి§చేయుసమయంబున వచ్చిన దర్శనంబు న
య్యర్థుల కిచ్చెనేని ప్రభు వాతఁడె కావున విద్యవాని కా
యర్థము మ్రుతియంబులు నవాంగనలుం గరులున్ హయంబులుం
బార్థివుఁ డిచ్చి పుచ్చెఁ దను బాండ్యనిమంత్రులు ప్రస్తుతింపఁగన్. ౧౨౩

క. అట్టిమహోదారుఁడు తన,పట్టణమున కేగి రాయబారులఁ గృపఁ జే
పట్టి సిరి నెగడెఁ గావున, నిట్టిగుణము లేక య్యెక్క నితరులతరమే. ౧౨౪

క. అనవుడు భోజుండును నె, మ్మనమున నవ్విక్రమార్కు మహనీయము లౌ
గొనములు గొనియాడుచు సి, గ్గెనయఁగ నాసొంపుదక్కి యింటికిఁ బోయెన్.

శా. శృంగారాధిపతిత్వసంజనితలక్ష్మీసంగతాంగు న్వియ
ద్గంగాకారణపాదపద్మునిఁ ద్రిలోకవ్యాపకుం గోపరూ
పాంగీకారకృతార్థితవ్రజకురంగాక్షీమనోరంగునిన్
సంగీతప్రియు సామవేదమయుఁ గంసధ్వంసి విశ్వంభరున్. ౧౨౬

శా. గంగాతుంగతరంగసంగతజటాకల్పాయమానాకృతిం
ద్వంగద్భోగభుజంగరాజఫణరత్నజ్యోతిరుద్దీప్తసా
రంగాంకద్యుతిధౌతరాజతగిరిం ద్రస్థానరంగస్థలీ
రంగద్భృంగిరిటిప్రసంగసుఖపారంపర్యధుర్యున్ శివున్. ౧౨౭

మాలిని. శశధరశకలాంకా సన్నసోనిష్కళంకా
విశదగిరినివాసీ [1]విశ్వబాధానిరాసీ

*యువతులు నూఱువురును †కోవిదలు- ‡విన్నవించుటయును విని యవనీపతి §చేయు
నెడలందున- చేయునెడ నప్పని [1]విశ్వబోధానురాశి.

దశముఖవరదాతా దైత్యహింసావిధాతా
పశుపతిహారరూపా ప్రాజ్యపూజ్యస్వరూపా! ౧౭౮

గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలిక భేకఫణీంద్ర వీరఘోట్టవిభాళ కళింగదేశనిర్ధూమధామ త్యాగనాగార్జున కర్ణాటద్రవిళాంధ్ర మహారాష్ట్ర భూపాలమౌళి నూపురసుందరచరణారవింద సనదప్రోలిపురవరాధీశ్వర వెలనాటిపృథ్వీశ్వరరాజ్యసముద్ధరణ శ్రీకొలని వెన్నయామాత్య పౌత్ర హారితసగోత్ర పవిత్ర సకలసుకవిమిత్ర కసువరాజతనూజ గోపరాజప్రణీతంబైన సింహాసనద్వాత్రింశికయను కావ్యంబునందు సాహసాంకుని సాహసోపకారంబులును విటవంచని వంచకత్వంబును గర్పూరాంగునిశాపమోక్షణంబును విక్రమార్కునౌదార్యంబు నన్నది యేకాదశాశ్వాసము.

శ్రీరస్తు.

# సింహాసనద్వాత్రింశిక.

## —। ద్వాదశాశ్వాసము. ।—

---

క. శ్రీపరిరంభణసమయ, ప్రాపితనవకుంకుమాంక భాసురనిజదే
హాలోకమితసాంద్రనీరద, రూపు న్సురవిమతనిహితకోపాటోపున్. ౧

చ. హృదయమునం దలంచి ధరణీశుఁడు క్రమ్మఱ నొక్క వేళ నా
త్రిదశవరాననంబున కతిప్రమదాస్పద మైనరాజ్యసం
పద నరుదేరఁగా నతని భావము గన్గొని యుల్ల సన్నవం
దదనుమతంబు మాన్పి విదితంబుగ నచ్చటిబొమ్మ యి ట్లనున్. ౨

### —। ముప్పదియొకటవబొమ్మకథ ।—

క. ముప్పదిమూఁడులు క్రమ్మఱి యప్పుడ చనుదెంచినాఁడ వాతనికథ లి
ట్లొప్పఁగదా యిఁకనొకకథ, చెప్పెద నీచేత నీకుఁ జెల్లదు చుమ్మీ. 3

ఉ. సజ్జనరక్షణోన్నతవిశాలభుజాయుగళుండు సర్వసం
పజ్జితకిన్నరేశ్వరుఁ డపారభటోద్భటవైరిమేదినీ
భృజ్జలజక్షపాకరుఁడు భీమబలాఢ్యుఁడు విక్రమార్కుఁ డా
యుజ్జయినీపురంబున గుణోర్జితుఁడై ధర యేలుచుండఁగన్. ౪

క. జనసుతుఁడు శాంతిశీలుం, డనఁగా నొకభిక్షుకుండు హరిమూర్తికిఁ దా
నెనయగు భూవల్లభునిం, గనుఁగొనఁ జనుదెంచి ఫలము కానుకయిచ్చెన్.

క. ఇచ్చినఁ గైకొని నృపుఁ డిటు, విచ్చేయుం డనుచు గారవించుచు నతనిన్
సచ్చరితుఁ డనుచు నాసన, మిచ్చి యుచితగోష్ఠి జరపి యెలమిని ననిపెన్.

వ. ఇ ట్లనిపిన తదనంతరంబున- ౬

గీ. ఆఫలంబు తనగృహాధ్యక్షు చేతికి, నిచ్చి లేచి లోనికేగె విభుఁడు
మఱియు నాతపస్వి మఱునాఁడు క్రొత్తగా, నొక్కపండు దెచ్చి యొసఁగెఁ బతికి. ౭

శా. ఆపండు న్నృపుఁ డట్లు పుచ్చుకొని భాండాగారిచే నిచ్చి ని
శ్శేపార న్ఫలహస్తుఁడై యవసరం బీక్షించుచు న్భిక్షుకుం
*డేప్రొద్దుం గవితావిలాసమున నక్షేందు ప్రతీకాశుఁ డా
క్ష్మాపాలుం గొలువంగ నయ్యె దశవర్షంబు ల్వినోదంబుగన్. ౮

---

* డేపారం గనరాని వేషమ్మున ల్లంకేశ్వప్రతీకాశుఁడై.

చ. అటు లొకనాఁడు క్రొత్తఫల మొతఁడు దెచ్చినఁ బెంచినట్టి మ
ర్కటమున కిచ్చె నాకపియుఁ గైకొని మూర్కొని చూచి మెచ్చుచుం
గటుకనఁ బంటులం గొఱుకఁగా నొకరత్నము గింజమాడ్కి ముం
దటఁ బడియె న్నిజప్రభలఁ దద్గృహమండప మ్మరుణవన్నెగాఁ. ౧౦

సీ. ఆరత్న మీక్షించి యాశ్చర్యమున విభుఁ డట గృహాధ్యక్షుఁ డైనట్టి లెంకఁ
బిలిపించి యిన్నాళ్ళఫలములు దెచ్చిన నరిగి మాణిక్యంబు లైనవాని
నన్నిటిఁ దెచ్చిన *నాఁడాఁపుటకు మెచ్చి వానికి నవి యిచ్చి వరుసఁ బిదప
శాంతిశీలుం డటు చనుదెంచుటయుఁ జూచి యనఘ నీ విట్టి యనర్ఘమణులు
నాకు నిచ్చి యేమి నాయెడఁ గైకొనఁ, దలఁచినాఁడ విపుడు విలువఁ జూడ
నొక్కరత్నమునకు నుర్వియంతయుఁ జాల, దన్నిరత్నములకు నెద్ది యిత్తు. ౧౧

క. అనవుఁడు వాభిక్షుకుఁ డో, జననాయక దీనికంటె సమధికగుణమౌ
పనిగలదు గాన వచ్చితి, ననఘుఁడ వభయుఁడవు సాహసాంకుఁడవగుటన్.

చ. క్షితివర నాప్రియంబు విను కృష్ణచతుర్దశినాఁటిరాత్రి యు
న్నత మగుమఱ్ఱిక్రింద మసనంబున నున్న పిశాచపంక్తి స
న్నుతు లొనరించి హోమము మనోరథసిద్ధికిఁ జేయువాఁడ నే
కతమున నీవు వచ్చుటికిఁ గ్రక్కున రమ్మటు నాకుఁ దోడ్పడన్. ౧౩

చ. అనవుడు నింతకాలము ప్రయాసమిదేటికి నాఁడె చెప్పినం
బనివిననే యడంచి యొక బ్రహ్మముఁ జేసితి నేఁడు నీవు చె
ప్పిన సమయంబు దప్పక యభీష్టము నీకొనగూర్ప వచ్చెదం
జనుమని వీడుకొల్పి నృపచంద్రుఁడు మానస ముత్సహింపఁగన్. ౧౪

వ. అంతఁ గృష్ణచతుర్దశి వచ్చినం దద్రాత్రి సమయంబున. ౧౫

క. నీలాంకితభూషణములు, నీలాగురులేపనములు నీలాంబరముల్
నీలోత్పలములు నిజదేహాలంకారములు గాఁగ నతఁ డొక్కండున్. ౧౬

సీ. కరవాలహస్తుఁ డై పురము వెల్వడి వీరభావంబుతోఁ బూర్వభాగమునను
డాకినీచండతాండవసముద్దండంబు ఘూకఘూత్కారాదిఘోరపదము
సంభృతశవదాహసమయసముజ్జ్వలచ్చటచటధ్వనిప్రపన్నసంకులంబు
నరకుటుంబవృద్ధజంబుకభీషణాక్రోశసంతతబధిరితాశాంతరంబు

*నాఁడాఁపురమునకు మెచ్చినదానికి నవియిచ్చి పిదప,

కర్పరాస్థిశూలకంకాళనృకపాల, దారుణంబు భూతకారణంబు
నాగభయరసంబునకు నాస్పదం బైన, యాశ్మశానభూమి కరిగి యచట.

వటతరువుక్రింద ననలోత్థమగు గుండంబుపొంతఁ దపసిం గని యే
మట పనివంపుము నావుడు, భటభావముఁ బొగడి కార్యపరుఁడై యతఁ డనె.

ఇచటికిఁ గ్రోశమాత్రమున నొక్కశింశుపావృక్షం బున్నది యందు విలగ్నుం డగు బేతాళుం డున్నవాఁ డతనిం గొంచు రమ్మంచు మహాసంబునం గాని రాఁడని పంచిన నట చని యనేకవిహంగభుజంగ పిశాచ బ్రహ్మరాక్షస సతతనివాసం బగు నమ్మహామహీరుహంబు డగ్గఱి తదీయశాఖావసక్తావనత చరణుండు నవలంబమానహస్తుండు నధోముఖుండు నగు నాభూత ప్రముఖుం జూచి. ౧౯

తరువెక్కి కాళులతగు లూడ్చునంతలోఁ జేతులుపట్టినం జేతు లూడ్చి
మఱియుఁ గాళ్ళం బట్టి మొఱవెట్టినాతని మెడమీఁదనిడుకొని పృథ్వి కుఱికి
బంటున కుచిత మాపనికిఁ బంపక భిక్షుకుండు పిలుచుకొని మోసఁ గోరెనని చె
ననిదూఱఁగాఁ బిశాచాగ్రేసరుఁడు మీఁదికెగసి యెప్పటియట్ల తగిలియుండె
భూవరుండు మోసపోయితి నని తాను, మీఁది కేగి వీఁపుమీఁదఁ బెట్టి
కొనుచు డిగ్గి యేమియు ను బల్క నోడుచుఁ, గదలివచ్చెఁ గార్యగౌరవమున.

ఆయెడ బేతాళుఁడు జన, నాయకుఁ బరికించి వేఁడి నరవర భార
వ్యాయామము మఱచి సుఖో, పాయంబునఁ దెరువు జరుగునని కథఁ జెప్పెన్.

అది యెట్లనిన. ౨౨

అఖిలలోకవిదిత మైన కాశీపురంబునఁ బ్రతాపముకుటుఁ డనఁగ రాజు
కలఁడు వాని కిష్టకాంత సోమప్రభ, యనఁగఁ గలదు పేరు సార్థముగను.

ఆదంపతులకు సుతుఁడు ప్రమోదాకృతిఁ బుట్టి వజ్రముకుటుఁ డనంగా
మేదినిఁ బరఁగుచు నెన్నఁగ, శ్రీదనరారంగ మరుని చెలువు వహించెన్. ౨౪

ఆరాజసుతుఁడు బుద్ధిశరీరుండను మంత్రిసుతుఁడు ప్రియసఖుఁడుగ నా
నారూపవినోదముల విహారంబులు సలుపుచు న్మహావ్యసనుం డై. ౨౫

ఇష్టసఖుండుఁ దానడవి కేగి మృగంబుల వేఁటలాడుచుం
గ్లిష్టశరీరుఁడై కొలని కేగి జలార్థము చేరి కన్యకా
సృష్టికి నాద్యలో యనెడు చెల్వలు*గొల్వఁగఁ దారకాంతర
స్పష్టహిమాంశురేఖ కిది సాటియనం బొడఁగాంచె నొక్కతెన్. ౨౬

*గొల్వఁగ నొప్పు మంగళా, స్పష్టహిమాంశురేఖ కిది సాటియనందగు కొమ్మఁ గన్గొనెన్.

చ. అనువుగ బాహుమూలనకుచాస్యకళ ల్గొనివచ్చినారు తెం
డని బిసమీనచక్రనలినౌఘము నీళ్ళను ముంచి వచ్చి శో
ధన మొనరించి చేకొను విధంబున నంబురుహాకరంబు పొం
*తను విహరించు బాలికయు ధారుణినాథతనూజుఁ జూచినన్. ౨౮

క. ఇరువురమూపుల మదనుఁడు, శరములుగాఁజేసి పులకసముదయ మొదవన్
సరి నయ్యిరువురమనములఁ, గరఁగించెం బ్రేమరసము గడలుకొనంగన్.

ఉ. అంబురుహాక్షి యప్పుడు ప్రియుంబున నొందలగల్వపూవుఁ గ
ర్ణంబునఁ జేర్చి, దంతశిఖరంబుల ఘట్టనచేసి, పాదప
ద్మంబునఁ బెట్టి, వక్షమున దాఁపి, మనోగతి లక్షణంబు వ
క్త్రంబునఁ దోఁపకుండఁ, జెలికత్తెలు గొల్వఁగ నేగ నూరికిన్. ౨౯

క. ఇటనాతఁడు నా వజ్రముకుటుండు ప్రియసఖుఁడు దన్నుఁ గొల్వఁగఁ బురికా
దట నరుదెంచియు నొకచోఁ, గట నుండెం దెలియరాని †కనుబేటమునన్.

వ. ఇట్లా కన్నియ నాయెడ్గావ జన్మప్రేమాతిశయంబు తెలుపఁగమి మిగులఁ బొగులుచు దాని తగులు వగల నొగులుచున్న రాజకుమారుం దెలుపకుండుట బుద్ధిగాదని బుద్ధిశరీరుండు డగ్గఱి నీ కింతచింత యేల విను మాకోమలి తలమీఁది యుత్పలంబు కర్ణంబునం జేర్చుకొనుట కర్ణోత్పలుం డనురాజుగలఁ, డది దంతఘట్టితంబు సేయుట దంతఘట్టకుం డనం దన్మంత్రి గలం, డది పదపద్మంబున మోపుటం జేసి పద్మావతి యను, నది హృదయంబున నత్తుట నీవ హృదయేశ్వరుండ, వని సూచించె నప్పడే నిశ్చయించితి నాకర్ణోత్పలుండు ‡కుంతలదేశం బేలుచుండు నని వినుము. ౩౦

ఉ. ఆతనిమంత్రికూఁతు భవదంగనగా నొనరించువాఁడ ర
మ్మా తలపోఁత లేల యని మానవనాథతనూజుఁ గొంచు న
న్వీతనిగూఢవేషముల నేగుచుఁ ॥గొంతలకంబు చేరి మా
[1]గ్రాతిథివృత్తి నొక్కతె గృహంబున నిల్చి యచుక్రమంబునన్. ౩౧

సీ. ఈపురం బేలురా జెవ్వఁ డాతని మంత్రి యెవ్వఁ డాతనికూఁతు రెవ్వరొక్కొ
యింతయు నెఱుఁగుదువే యని యడిగిన నుర్వీశ్వరుండు కర్ణోత్పలుండు
తన్మంత్రివర్యుండు దంతఘట్టకుఁడు తత్తనయ పద్మావతి యనఁగఁ గలదు
దానికి నే నిష్టదాసినై వర్తింతు నని యది చెప్పిన నాత్మఁ బొంగి

*తనిలిచియున్న బాలికయు. †కనుజకెనమునన్ ‡కళింగదేశం ॥నేగికళింగపురంబుసొచ్చి
[1]గ్గాతురవృత్తి.

మంత్రిపుత్రుఁడు తనమాట నిక్కువమైన, నతని నూఱడించి యదియ యటకు
దూతిగాఁగ మొదలుదొరకొని తమరాక, చెప్పి పుచ్చి రపుడు చెలియకడకు.

క. అది చని యొక రాకొమరుఁడు, సుదతీ నీతలఁ పెఱింగి † సుగుణత యొందం
గదియఁ జను దెంచి సమ్మద, మొదవఁగ నాయింట విడిసి యున్నాఁ డనినన్.

వ. అది విని గూఢభావం బేర్పడకుండ దానిని భర్జించి రోషమిషంబునం గర్పూ
ర మలయజ సాంద్రంబు లగు రెండుచేతుల దాని రెండుచెక్కులం దనపది
వ్రేళ్లు నంట వ్రేసిన నది ఖిన్నవదనయై తిరిగి చనుదెంచి తత్కృతావమానంబు
సూపిన నారాకొమరుం డింక నాశ లే దని యున్న నతనిం దత్సహచరుం
డగు బుద్ధిశరీరుం డిట్లనియె. ౩౬

సీ. చింతింప కిఁక దీని చెక్కిళ్లఁ దెల్లని పదిరేఖలుగ వ్రేసి పంపు టరయ
నిదిశుక్లపక్ష మీపదిదినంబులుఁ బుచ్చి రమ్మని చెప్పుట నమ్ము మనుచుఁ
దెలిపి యీపదిదినంబులుఁ బుచ్చి యాదాసిఁ బ్రార్థించి యెప్పటియట్ల పనుప
నది తొంటి క్రియ మాటలాడఁగాఁ గుంకుమనూఱెడి సఖిఁ బిల్చినోఁ యీఁద
దీని నడుపు మనుచుఁ దెగి మూఁడువ్రేళ్లు వ్రే, యించి వెడలనడిచె వంచనమున
మగిడివచ్చి కుంకుమద్రాంకితముఁ లా, వెట్లు సూపె నది యభీష్టమమర. ౩౭

గీ. చూచి యాసతేమిఁ ‡ జూకురుఁ బొందుచు, చచ్చుటొప్పు ననుచు వెచ్చనూర్చు
వజ్రముకుటుఁ బొగల పల దసి లత్సఖుఁ, డాస గలుగఁ దెలిపి దాసిఁ బిలిచి.

వ. ఆకన్నియ రజస్వల యై యుండంబోలుఁ గావున నెట్టిగా నిమూఁడు వ్రేట్లు
వ్రేయించు త్రోలంచె నిమూఁడు దినంబులుం గడపి యింక నొక్క తోయంబె
యరుగవలయు నని వేఁడుకొనిన నది యుం గ్రమంబున నాలుగవనాఁడు
కన్యకాసౌధంబునకుం జని మగిడి వచ్చి. ౩౮

మ. నగుమో మొప్పఁగ నేఁటమాట వినుచు న్నన్నాదరింపంగ నే
నుఁగు తిద్వారి మదించు కంబము వెస న్నుగ్గాడి యేతెంచిన
న్నాగిసాల న్విడలంగరా డనుచు నంభోజాక్షి పీఠంబుపై
డిగజాఱి న్ననుఁ ద్రాటఁ గట్టి విడిచెన్ డెందంబు బిట్టుల్లఁగాన్. ౩౯

క. అనవుడు తన్నారంబునఁ, జను దెమ్మను టయ్యె ననుచు జనపతిసుతునిం
గొనిచని యాపీఠముపై, నసిపె నతని మీఁదివార లటు చేఁదుకొనన్. ౪౦

† సుందర మొదవన్ - సుగుణతనమునన్. ‡ సుగ్గియ్యచుఁ బొక్కుచు.

శా. ఆసాధ్యాంతరకేళిఁ రత్నమయపర్యంకంబుపై నుండి త
ద్దాసీలోకకృతోపచారుఁ డగుచుం దాంబూలపుష్పాదు లు
ల్లాసం బందఁ జెలంగి కైకొనుచు బాల న్నిగ్గుదేఱం బరీ
హాసోక్తిం బలికించి రాకొమరుఁ డేకాంతంబునం బ్రోడయై. ౪౧

క. తలఁపునకుం దొంగకు నగ్గల మగుతమకమున బాలఁ గౌఁగిట నిడి మైఁ
బులకలు మొలవఁగఁ దలకొని, చులుకఁగ రతిసుఖముచవులు చూపుచుఁ గవసెన్.

ఉ. ఈగతిఁ బెక్కునాళ్ళు సుఖియించుచు నుండి విదేశభూమిలో
నేగతి నున్నవాఁడొ తన యిష్టసఖుం డని యిచ్చలోనఁ జిం
తాగతుఁడైన దీనికిఁ గతం బిట నేటిది చెప్పు మన్న నా
త్యాగమనంబుఁ దన్మతియు నాతని యున్కియుఁ జెప్పె నేర్పడన్. ౪౩

క. అది విని నీకాప్తుఁడు నా, హృదయస్థితి దెలుఁగు జాణఁ డిక్కియ దాసీ
సదనమున నొగులుచుండఁగ, నది యేలా చెప్ప వాతఁ డాప్తుఁడు గాఁడా.

క. అతనికి విందొనరింపం, జతురుఁడు నను మెచ్చుఁ బాయసముఁ బక్వాన్నా
న్వితముగ ఘృతముం గొనిచని, యతిముదమునఁ బెట్టి యింటికరుదెమ్మనుచున్.

సీ. అపదార్థములు రయమ్మున సమకూర్చి యాత్రాఁడు వెంటనే యనుప నతఁడు
చని దాసిగృహమునఁ దన యిష్టసఖుఁ గాంచి బాలిక యిదె యిందుఁ బనిచె ననిన
నకట నాయున్కిఁ జెప్పక యుండవైతివి లిమటిఁ రాఁడి చిత్తంబు దరలుఁ గాన
సతు లిష్టుచెలికాసి నైతురె నాకును విషము వెట్టిది దొడ్డ విందువనిచెఁ
జూడుమనుచు నతఁడు శునకంబునకుఁ బెట్టె, నదియుఁ దినుట తడవె యవనిఁ గూలె
నదిరి వారిచిత్త మెఱిఁగి వర్తించెదు, వారకేల కీడు వచ్చు నరక. ౪౬

వ. ఇట్లు దృష్టాంతంబు చూపి నీవింక గూఢంబున నేగి యతనికి భోజనంబు పెట్టితి నని చెప్పి మధుపానమత్త యగు నమ్మత్తకాశినికి లోఁదొడ్డ గోరు నాట మూఁడు పోటులు వరుసం బొడిచి పాదభూషణమ్ము గొని రమ్మిటఁ గార్యంబు చూచుకొందము ని యనిపిన నతండు నని యాక్రమం బొనరించి యందియఁ గొని వచ్చిన. ౪౭

ఉ. అక్కడ మాని తత్పురి యుపాంతమున న్నసనంబులోన గో
రక్షుఁడు మీననాథుఁడు ధరం జరియించుచు విశ్రమార్థమై
యిక్కడ నిల్చినారొ యన సిద్ధులు సద్ధతి సిద్ధవేషులై
యొక్కమఠంబు గట్టుకొని యుండిరి శూలము కేలఁ గ్రాలఁగన్. ౪౮

క. ఒకనాఁ డటు కర్ణోత్పలు,నికొడుకు మృతుఁడైన నెఱిఁగి నీతివిదుఁడునుం
త్రికుమారుఁడు నృపసుతుచే,తికి నూపుర మిచ్చి సంతఁ ద్రిప్పఁగఁబనిచెన్.

క. అమ్మెద నని చూపుము తెగ, నమ్మకు మఱి దీనిజాడ లడిగిన నీచి
త్తమ్మునఁ గలఁగక నాకీ, సొమ్మిచ్చెను గురుఁ డటంచుఁ జూపుము నన్నున్.

సీ. అనవుడు నొఁగాక యని పురంబున కేగి యంగడి నమ్మఁజూపంగ నొకతె
మనపాప సొమ్మని మంత్రికిఁ జెప్పిన నాతఁడు సొమ్ముతో నతనిఁ బట్టి
పృథివీశుముందఱఁ బెట్టినఁ గలుషించి చెప్పరా యిది యెట్లు చేరె ననిన
నే మ్రుచ్చుఁగాను మీ కీజాడఁ జెప్పెద బంటుల నా వెంటఁ బనుపు మనుచుఁ
గొందఱా రెకులను దోడ కొనుచువచ్చి, నాకుసొమ్మిచ్చెనీగురునాథుఁడనుచుఁ
జూప వారలునుదిఁ గడుఁజోద్యమంది, యట్టి వేషంబునకు సంశయంబునొంది.

క. ఓగురునాయక యీ సొ, మ్మేగతి నినుఁ జేరెఁ జెప్పనేతె మ్మనినన్
జోగులము మేము మాకట, రాఁగూడదు గాన రాజు రమ్మనుఁ డిటకున్.

క. అతనికిఁ జెప్పెద మనవుడు, నతివేగమ యేగి వార లటు వినిపింపన్
క్షితిపతియును మతి నతివి,స్మితుఁ డై చను దెంచి కపటసిద్ధుని మ్రోలన్.

క. వినతుఁడై యున్న యాతని, గనుఁగొని నీపీట దంతఘట్టకుసుత డా
కిని యై యీమసనములో,నను రాత్రులు దిరుగు నది దిగంబర యగుచున్.

క. ఈరాత్రి నీకుమారుని, మారిమసఁగినట్లు చంపి మలయఁగ నేనా
ఘోరాతిశూలనిహతిఁద,దూరుస్థలి నొంచి చరణ మొడియఁగ నెగసెన్.

క. కాలు విదిర్చిన నందియ, కీలెడలినఁ బుచ్చుకొంటి క్షితినాయక యే
స్త్రీలను జంపరు గావున, నాలలనను వెడలనుపు మంతియ చాలున్. ౧౭

క. అనవుడు వెరఁగంది భయం,బున మంత్రితనూజసౌధమున కంగనలం
బనిచి తొడపైఁ ద్రిశూలం, బునఁ బొడిచిన యట్టులున్న *పోటులు దెలిసెన్.

గీ. తెలిసి శోకరోషకలుషుఁడై యారాజు, మగిడి పురికి నేగి మంత్రికూఁతు
దయ్యమనుచుఁ బ్రజలుదలఁకఁగా వెడలఁగొ,ట్టించెఁజూడనిదికడిందియనుచు.

శా. ఆకన్యామణి దుఃఖమూలమునఁ బ్రాణాంత్యంబు చింతింపఁగా
నాకాశీపురరాజపుత్రకుఁడు వ్యాఘ్రాకారుఁడై తన్నన
శ్శోకం బార్చుచు †వెడ్డుజోగిఁ దనయిష్టుంగా నెఱింగించి య
స్తోకం బౌ నిజరాజ్యముం దెలుపుచుం దోడ్కొంచు నేగెం బ్రియన్. ౧౮

*భూపతిదెలిసెన్ †వేడ్కజోగి.

క. తదనంతరంబ యొక నా,ల్గుదినములకు దంతఘట్టకుఁడు సతియును దా
మదిఁ *గూఁతుశోకదహనము,పొదివినఁబరలోకమునకుఁబోయెం బెలుచన్.

క. ఆపాపము గడపటఁ గా,శీపతిపుత్త్రుండొ యతనిచెలికాఁడో యీ
భూపాలుఁడో వీరలలో, నేపురుషుం డొందుఁ జెప్పు మెఱిఁగినకొలఁదిన్.

సీ. ఎఱిఁగి చెప్పకయున్న నిప్పుడే నీతల పదివ్రక్కలై పడు నిది నిజంబు
కావునఁ జెప్పుమా నావుడు నిఁక నూరకుంట మోసం బని యుర్వీశ్వరుఁడు
కామాతురుం డౌచుఁ బ్రేమ రాకొమరుండు †తనపనిఁగాఁ జేసికొనుటతగవు
సచివసూనుఁడు నిజస్వామికార్యమునకు మర్మంబుసేయుట ధర్మపథము
తలవరులచేత వానివర్తనము లెల్ల, మొదలఁదెలియక యదినిజంబుగఁదలంచి
చేసెఁగావునదుఃతంబుచెందుఁ బ్రభుని, రాష్ట్రకృతమైనపాపంబురాజుఁబొందు.

క. అనవుడు బేతాళుఁడు నె,మ్మనమునఁ గొనియాడి యతని మౌనత్యాగం
బున నిలువక యెగసి రయం,బునఁ జని తరుశాఖఁ దగిలెఁ బూర్వస్థితితోన్.

వ. ఇట్లు విడిపించుకొని పోయిన. ౯౪

క. ఆనరపతి క్రమ్మఱఁ జని, పీనుఁగు క్రియ పేఁపురిఁగాఁదఁ బెట్టుకొని చనం
గా నొకకథనెపమున న,మ్మౌనము విడిపించి యతఁడు మగుడం బాఱెన్.

వ. ఇట్లు మొదలికథంబోలె సారెసారెకుం గథలు చెప్పి మఱుఁగులైన సదుత్త
రంబు లందుచుం బరికించుచు నిరువదియేనుమాఱులుదాఁక రాకపోకలనల
యించి యతనివివేకంబునకు స్థిరోద్యోగంబునకుం బరిణమించి బేతాళుండు
మే లొనగూర్పం దలంచి. ౯౬

క. నరనాథ సర్వలక్షణ,పరిపూర్ణుఁడ వంచు నిన్ను బలిసేయ మదిం
బరికించి కపటభిక్షుకుఁ, డరుదుగ నను దోడితేర ననుపుట గంటే. ౯౭

గీ. నన్నుఁగొంచు నేగ నిన్నునుసాష్టాంగ,మెఱఁగుమనినమ్రొక్క నెఱుఁగఁదొల్లి
నేఁడు నిన్నుఁ జూచి నేర్చెద నిప్పుడు, మ్రొక్కిచూపు మనుము మోసపోక.

క. ఇటు మ్రొక్కుమనుచుఁ జాఁగినఁ, దటుకున నడిదమున వాని తల ద్రెంచి సము
త్కట మగు ననలములో నొ,క్కట వైవుము సిద్ధులెల్ల ‡గతిపడునీకున్.

చ. అనవుడు నట్ల యియ్యకొని యాతని మూఁపునఁ బెట్టుకొంచు దె
చ్చిన మది మెచ్చి వాఁడు మును సెప్పిన రీతిని మ్రొక్కుమన్న నే

*గూఁతుశోకదహనంబున †తనదానిగా ‡గనఁబడు.

రనిక్రియఁబల్కిన న్నతి ధరం బ్రణమిల్లిన వానిమ స్తకం
బనువునఁ ద్రెంచి పావకున కాహుతిగా నొనరించి సిద్ధుఁ డై. ౭౦

గీ. ఆత్మరక్షణాఢ్యుఁ డగువాని నటువేల్చి, నంత భూతనాథుఁ డతని మెచ్చి
యెప్పుడైనఁ దలఁపు మేవచ్చి నిల్చెద, సిద్ధు లెనిమిదియును జెందుననియె.

క. సుర లటు పేర్కొని విద్యా,ధరరాజ్యము గలుగనొసఁగి తద్గుణములక
చ్చెరు వందుచు నేగిరి భూ,వరుఁడును బేతాళుననిపి వచ్చెం బురికిన్.*

శా. ఈసామర్థ్యము నేర్పుఁ దెంపు నణిమాద్యీశత్వము న్లేక నీ
కీసింహాసన మెక్కఁ బోనె మదిలో నీక్షింపుమా యన్న ను
ల్లాసం బెల్లఁ దొఱంగి తద్గుణగణశ్లాఘాపరుం డౌచు ల
జ్జాసంగవ్యథఁ గ్రమ్మఱం జనియె భోజక్ష్మాభుజుం డింటికిన్. ౭౩

— ముప్పదిరెండవబొమ్మకథ. —

క. తదనంతరంబ యా ము,ప్పదిరెండవబొమ్మయెనఁ బద మిడు మని స
మ్మదమున నిఁకఁబల్కెగుననని, మదిలోపలఁదలఁచియతఁడుమఱునాఁడెలమిన్.

క. నన్మునిహృదయారాధితుఁ, జిన్మూర్తిఁ గృపావిశేషు శేషాభరణు
న్మన్మథమదగజకేసరి, జన్మజరామృత్యురహితు సర్వేశ్వరునిన్. ౭౪

క. డెందంబునఁ దలఁచుచు నం,క్రందనమణిపీఠ మెక్కఁ గడఁగెడునెడ నా
కందువ నిలిచిన బొమ్మ వె,సం దిన్నని నగవుతోడ జనపతిఁ బలికెన్. ౭౬

చ. వలదననేల యిట్టి దురవస్థలఁ బొందఁగనేల నీకు భూ
తలమున విక్రమార్కుగతి ధర్మము సత్యము సాహసంబు ని
శ్చలముగ నిల్పలేని మనుజప్రభుఁ డీదెస మెట్టఁజూచినం
దలఁపులు నిష్ఫలంబు లగుఁ దత్త్వ మెఱుంగని బుద్ధి నిన్నిటన్. ౭౭

చ. అతని గుణక్రమం బెఱుఁగు మయ్య భుజాబలభీమసేనుఁ డా
తతరణకౌశలార్జునుఁడు ధర్మయుధిష్ఠిరుఁ డార్తరక్షణా
చ్యుతుఁడు కృపాదిలీపుఁ డరిసూదనభార్గవుఁ డర్థబోధవా
క్పతి విభవామరేంద్రుఁ డనఁగా నఁత డుజ్జయినీపురంబునన్. ౭౮

చ. క్రతువు లనేకము ల్నడిపి గౌరవ మేర్పడ నుర్వి సప్తసం
తతులును నిల్పి వేదనినదంబులు విప్రగృహంబులందు నం

*ఈకందమునకు మాఱుగా, వ. అనిన నట్ల విక్రమార్కుండు సంకల్పసిద్ధుండయ్యెఁగావున- అని యొక ప్రతిలోఁ గలదు.

తతముఁ జెలంగ దీను లతిదానముల న్నెగడంగ ధర్మసం
గతి మెఱయించె రాజపధికారము లెవ్వియుఁ జెందకుండఁగన్. ౭౯

చ. కఱవులపే రడంచి యుదకంబుల నెప్పుడు నర్ణవాకృతిం
జెఱువులు నిండియుండఁ దమసీమలఁ దప్పక నాల్గుజాతులుం
దఱచుగ ధర్మము ల్నెఱపఁ*దస్కరజాతుల నప్రమత్తత
న్నెఱయఁగనీక సజ్జనులు మెచ్చఁగ శాశ్వతకీర్తికాముఁడై. ౮౦

ఉ. అంబుజమిత్రు నంశ మని యార్యులు సన్నుతి సేయఁగా సము
ద్రంబులు నాల్గుమేర లగు ధారుణి యంతయు నేలుచుం బ్రతా
పంబున రాజు లెల్లఁ దన పంపు చరింపుచుఁ గొల్వఁ గార్యఖ
డ్గంబుల నైరులం దునిమె గట్టిగ సత్యము నిల్పుకోఁకిన్. ౮౧

సీ. సత్త్వంబునను మహాశ్చర్యంబుగా గెల్చి వసుధేశులను నాత్మవశులఁ జేసి
వరరత్నకనకాది వస్తువు లన్నియుఁ దనసొమ్ముగాఁ జేసికొని యతండు
హయమేధములు మొదలైన యాగములందుఁగూడి దేవత లెల్లఁదోడుపడఁగ
బడుగులు వేఁడినఁ బ్రాణంబు లైనను వంచింప కొసఁగెడు వ్రతము వట్టి
సర్వదిక్కులందుఁ జాటించి యర్థులఁ, గూడఁ దిగిచి వారు గోరినట్లు
యాళ్ళ నర్థమును యథోచితంబుగ నిచ్చి, శాసనంబుగాఁగ శక మొనర్చె.

వ. భువిలో నభూతపూర్వంబు నద్భుతంబు నగుకృత్యంబు శకం బనంబడుఁ
దొల్లి జరుగు శ్రీరామశకంబు యుధిష్ఠిరశకంబు నణంచి నిజశకంబు నిల్పిన
నందానందాది సంవత్సరాద్యమ్మున విక్రమార్కశకంబై చతుర్లక్షజ్యోతి
శ్శాస్త్రగతిప్రవర్తకం బయ్యె ౮౩

గీ. నదుమ శాలివాహనశకంబు గలిగియుఁ, జెడక యుత్తరమునఁ బుడమిలోన
నెన్నిచూడఁ బదియు నెనిమిది వేలేఁడు, లతనిశకము రూఢినలరఁగలదు. ౮౪

క. ఈపాటి మహిమ గుణములు, నీపాలం గలిగె నేని నేఁ జెక్కు వృథా
టోపంబులు వల దని యో, క్ష్మాపాలక నిన్ను మాన్పఁ జలమో ఫలమో.

క. అని చెప్పి మఱియు నాతని, మన మలరఁగఁ బలికె నిన్నిమాటలు మానే
ర్పున నతనిమహిమకొలఁది, †న్వివరించితి నింతె కాక నీవల్పుఁడవా.

క. నరనారాయణులనఁగాఁ, బరఁగెడు హరిమూర్తు లుర్వి ఫల్గునదామో
దరులై పుట్టిరి నాఁడా, నరుఁ డతఁడై పుట్టినాఁడు నరవరతిలకా. ౮౭

* దస్కరజాతుల † వినిపించిననింత నేమి.

క. ఈకలియుగమున విద్యల, కేకడఁ జేపట్టు లేమి యెఱింగి పలికి వా
ణీకాముని వినిపించిన, నాకమలభవుండు సెప్పె నచ్యుతుతోడన్. ౮౮

*గీ. అచ్యుతుండువిద్యలైశ్వర్యమునఁగాని, మెఱయవనుచుఁజెప్పియెఱుకగలుగ
నరునిఁ బుట్టఁ బంచె నరపతిత్వము గోరి, యతఁడు నవని నీవయై జనించె.

క. నరునకు నారాయణునకు, నరయఁగ భేదంబు లేదు హరి యొక్కఁడు న
య్యిరువురయా పగుఁ గావున, వెరవ్రుగఁ బరికింప నీవ విష్ణుఁడ వనఘా.

క. ఈపుణ్యుని నినుఁ జూచిన, శాపావధి గలిగెఁ గల్మషం బడఁగెఁ గులో
ద్దీపక ! "నావిష్ణుః పృథివీపతి" యనుకీర్తి నీకు విహితం బయ్యెన్. ౯౧

చ. అన విని చోద్యమంది వసుధాధిపుఁ డప్పటి శాపకారణం
బానరఁగఁ జెప్పు మెవ్వ రని యుత్సుకుఁడై తను వేఁడినం గ్రమం
బున నది క్రమ్మఱం బలికె భోజనృపాలక ! పార్వతీసఖీ
జనులము నేము దేవి కనుసన్నల డగ్గఱి కొల్తు మెప్పుడున్. ౯౨

క. ఒకనాఁ డేమును నయ్యం, బికయును విశ్రాంతి కేగి శుకపికభృంగ
ప్రకరపరితోషకర మగు, నొకవనమున విరులు గోయుచున్నెడ వేడ్కన్.

సీ. కన్నుల విని గాలిఁ జెన్నొందు నందియ యనుగుఁదమ్మికి బెడఁగడరఁజేయు
నందిని నులికించు పెందోలు హారంబట్టుకైవడి నునుపారఁ గానుపోసి
తలఁచినయంత నె వలపులఁ దలకొల్పు పెలిపూఁత మేనెల్లఁ గలయఁబూసి
జక్కవకవ కెదురెక్కుడై రేవెలుఁ గెలమితో జడలపై వెలుఁగుచుండ
విసము మెడనుండియును దీపి(వెలికిఁదోఁపఁ, గేలశూలంబు ఫణిపతిలీల మెఱయ
మిండజంగమైయామంచుఁగొండకూఁతు, నెదుటికరుదెంచెమ్ముక్కంటిచదురులాఁడు

క. ఆచందము గనుపట్టం, జూచిన యావేళ మనసిజుఁడు సుమ్ముఁ దెగం
జూచి తనకమ్మఁదూపుల, మాచిత్తములెల్లఁ గరఁచె మానము లెడలన్.

క. పులకించెఁ జెక్కు లలికం, బుల లేఁజెమ రొత్తె నధరముల నద రొదవెన్
వలువల గనయము లూడెం, †బలుకమఱచియుఁటిమేము ప్రతిమలమాడ్కిన్.

క. ఆతఱి నయ్యంబిక మా, చేతోగతు లెఱింగి కనలి చెలిమికి విలిగా
భూతలమునఁ ‡బుత్తళు లై, చైతన్యము లుడుగుఁ డనుచు శాపంబిచ్చెన్.

* అచ్యుతుండ విద్యలైశ్వర్యమునఁగాని, మెఱయవనుచుఁ జెప్పి యెఱుకగలిగి
యవనిబుట్టఁబంచె నాహరియిపుడు నీ, వైజనించినాఁ డవవనిపాళ.

( దీప్తి † బలుకమఱచుంటిమేము ‡ బుత్తికలై.

ఉ. ఆక్రియ శాప మిచ్చిన భయంబున నందఱ మాత్మ లజ్జ ర
తాక్రియసన్నిపాత ముడుగంబడు గైవడిఁ గామనిక్రియో
పక్రమ మానెడం దెలిసి పార్వతికిం బ్రణమిల్లి తల్లి మా
కేక్రియ శాపమోక్ష మగు నింత దలంచుట మాతృకృత్యమే! ౯౮

మ. అనుచుం బ్రార్థన చేసిన న్వని కృపాయత్తాత్మయై మీరు కాం
చనపాంచాలికలై జనించుఁ డొక ప్రస్తావంబునం బుణ్యవ
ర్తనునిం జెప్పఁగ వాక్యసిద్ధి యగుఁ దత్కాలంబు మీశాపమో
చనమౌఁ బొండని వీడుకొల్పిన మనస్తాపంబునం బిమ్మటన్. ౯౯

వ. ఒక్కమాఱే భూలోకంబునకు రానోడి, మాసంప్రార్థన విశ్వకర్మనిర్మితం బగు నయ్యింద్రసింహాసనంబున నట్లుండి పదంపడి భూమికి వచ్చి యీయుత్తమ నాయకు గుణకథనార్థమై నిన్నిన్నిమాఱులు వారించితిమి. నాపేరు శృంగారతిలక యనం బరఁగు, వీరలు జయయు ను, విజయయు, మలయావతియు, ననంగసంజీవనియు ను, గంధర్వసేన యుఁ, బ్రభావతియు, సుప్రభయు, సంభోగనిధియు, సుభద్రయుఁ, జంద్రికయు, కురంగనయనయు, ననంగధ్వజయు, నిందువదనయు, విలాసరసికయుఁ, గోమలియు, సౌందర్యవతియు,లావణ్యవతియు, లజ్జావతియు, నిందుమతియు, జనమోహినియును, విద్యాధరియు, హరిమధ్యయు, సుఖప్రదాయినియుఁ, బ్రబోధవతియు, మలయవతియు, హంసగమనయు, నంగసుందరియు, సుకేశియుఁ, జతురికయు, హేమాంగియుఁ, దలోదరియు, *నను పేరులు గలవారని యెఱుంగు మిట్టి మేమును- ౧౦౦

క. బొమ్మలమై యామణిపీ,ఠమ్మున బహుకాలముండి దస్సితి మని చి
త్తమ్ములఁ బొగులఁగ మాభా,గ్యమ్మున నీతోడ మాట లాడంగలిగెన్.

క. కష్టంబు వీడె నీకే,యిష్టం బది వేఁడు మిప్పు డిచ్చెద మనినన్
సాష్టాంగ మెరఁగి భోజుఁడు,హృష్టుండై పలికె వారిహృదయము లలరన్.

క. మీకృప సంపద లన్నియు, నా కుండగ నేమి ప్రార్థనము భవదీయా
లోకము గలిగెను బుణ్య,శ్లోకుఁడ నైయుండఁ గంటి లోకులు వొగడన్.

క. అని వినయోక్తులు పలికినఁ, గొనియాడుచు నిలిచి రాజకుంజర నీచే
సిన యుపకారమునకు నే, మని ప్రత్యుపకృతి యొనర్ప నర్హము మాకున్.

---

* మనోహారియు, మానవతియు, పద్మపాణియు, నీలవేణి, శుకవాణియు, పులినశ్రోణియు, నిరుపమయు నను పేరులు ప్రత్యంతరములలో నున్నవి. వీనింజేర్చిన ౩౨ నకు మించినవి.

చ. సకలకళాప్రవీణుఁడవు సజ్జనరక్షణదక్షిణుండ వం
ధకరిపుభక్తిశీలుఁడవు దానవినోదివి సర్వభావభా
వకుఁడవు విష్ణుమూర్తివి దివానిశముం గవిపాఠకార్థిగా
యకనుతిశాలి వుర్వీపతి వల్భుఁడ వా భువి భోజభూవరా! ౧౦౫

శా. నీ కేవాంఛయు లేకయున్న వినుమా నిన్నవ్వఁ డీక్షించినన్
మాకిష్టంబు సరస్వతీవిభవ మామర్త్యుండు నేపొందు, వా
క్ప్రౌఢుండై విలసిల్లఁ జేసెదము భూపాలాగ్రణీ నీయశం
బాకల్పంబుగ నొప్పఁగాత జనలోకానందమై సాంద్రమై. ౧౦౬

సీ. కన్ను లయ్యెను బండికన్నులయ్యెను జంద్రసూర్యు లెవ్వనికడసొంపుగనిరి
సుతుఁడయ్యె రథముపై సూతుఁడయ్యెను సురజ్యేష్ఠుఁ డెవ్వనికడ శ్రేష్ఠుఁడయ్యెఁ
దల్పంబునయ్యె నాకల్పంబు నయ్యె నాగేంద్రుఁ డెవ్వనికడ నెన్నఁబడియెఁ
బదమయ్యె మస్తకాస్పద మయ్యె నాకాశమధ్య మెవ్వనికడ మహిమ కెక్కె
నట్టి యుభయమూర్తి హరిహరనాథుండు, దేవదేవుఁ డిష్టదైవ మగుచు
నెరయఁ బ్రోచుఁగాత నీకొల్వువారల, భోజనేంద్రభోజ భోజరాజ. ౧౦౭

క. పర్యాప్తంబుగఁ గథ లీ, మర్యాద న్విన్నయట్టి మానవుననుం
దార్యంబును దెగువయుగాం, ధైర్యమ్మును బ్రియమునయముఁ బెంపువహించున్

మ. అని దీవించి యుమాసఖీజనులు దివ్యాకారసంపత్తి సొం
పున నాకాశమున న్మెఱుంగులక్రియం బొల్పారునుల్లాసనం
జనితప్రౌఢవచోవిలాసముల నాశ్చర్యంబు రెట్టింప నా
జను లెల్లం దముఁ జూడఁగాఁ జనిరి భోజశ్రేష్ఠు నగ్గించుచున్. ౧౦౯

శా. భోజేంద్రుండును నెక్కరాని హృదయాంభోజంబులోఁ గాంచి ని
ర్వ్యాజంబై విలసిల్లు యత్నమున విద్వత్సన్నిధిన్ దానిపైఁ
దేజోమూర్తిఁ ద్రిలోకవంద్యుని *మహాదేవు న్మను న్నిల్పి త
త్పూజాలబ్ధ వరప్రసాదమహిమన్ భూమండలం బేలెఁగన్. ౧౧౦

శా. సద్యోనిర్ణయ వాదులు న్సరసులు †స్సంగీతకావ్యక్రియా
విద్యావంతు లనంతశిల్పరచనావిజ్ఞానులు న్సర్వసం
పద్యోగప్రథమానకీర్తియుతులు న్భామామనోరంజనా
హృద్యాకారులుఁ బుణ్యవర్తనులు నై యేపారి రుర్వీజనుల్. ౧౧౧

* మహాదేవున్నివున్నిల్పి. మహాదేవుం దగన్నిల్పి † సంగీతవాద్యక్రియా.

మ. అనుచుం జెప్పిన నద్రిజాత మిగులన్ హర్షించి యో దేవ యే
నును బూర్వంబునఁ గొంత వింటిఁ బిదప న్నాత్మప్రసంగంబున
న్వినవింపౌగతి నేఁడు విస్తరముగా వింటి న్మహావీరుఁ డా
తనిసామర్థ్యము నీప్రసాదమునఁ జిత్రం బయ్యె మృత్యుంజయా. ౧౧౨

క. *నాకోరిన కథలెల్లను, నేకతమునఁ దెలియ నానతిచ్చితి దేవా
యీకలియుగపర్యంతం, బీకథలు ప్రసిద్ధి కెక్కు నిట నీకరుణన్. ౧౧౩

మ. ‡అని యారీతి నుమామహేశులకు సాంద్రానందసంధానమై
వినవింపై కవిసమ్మతప్రస్తుతమై విద్వన్మనఃసద్మజీ
వనమై పావనమై మహాసనకథాద్వాత్రింశికర్ణామృతం
బన నెల్లప్పుడుఁ జెల్లుఁగాత భువిలో నాచంద్రతారార్కమై. ౧౧౪

శా. అంభోరాశిజలప్రపూర్ణవిహృతివ్యాసక్తచిత్తాంబుజుం
గుంభీసంభవముఖ్యసర్వమునివాగ్గుంభస్తుతారంభునిన్
జంభారాతిసమీహితాయసమహాస్తంభాంతసంభూతసం
రంభాటోపవిదారితారివరుఁ బ్రహ్లాదప్రతిష్ఠాపరున్. ౧౧౫

శా. బాణాగారముఖాభిరక్షణగుణప్రారబ్ధయుద్ధక్రియా
క్షీణోపేంద్రసుహృత్త్వకృత్యుని దృఢాంగీకారసన్మానిగీ
ర్వాణాధీశసమర్చితాంఘ్రియుగళు న్వామాంగవిన్యస్తశ
ర్వాణీమగ్నమనోంబుజుం §ద్రిభువనావష్టంభునిన్ శంభునిన్. ౧౧౬

మాలిని. నవహిమకరజూటా నందితామర్త్యకూటా
జవనవృషభవాహా శంఖచక్రాంకదేహా
ధవళనిజశరీరా దానవధ్వంసకారా
శివమురరిపురూపా శిష్టదృష్టస్వరూపా. ౧౧౭

గద్యము. ఆదిరాయగజగంధవారణ వైరిమండలికభేకఫణీంద్ర వీరఘోట్టవిభాళ కళింగదేశసర్వామధామ త్యాగనాగార్జున కర్ణాట ద్రవిళాంధ్ర మహారాష్ట్ర భూపాలరూపనూపురసుందరచరణారవింద ననదప్రోలిపురవరాధీశ్వర వెలనాఁటిపృథ్వీశ్వరరాజ్యసముద్ధరణ శ్రీకొఱవి వెన్నయామాత్య పౌత్ర హరితసగోత్ర సకలసుకవిమిత్ర కసవరాజతనూజ గోపరాజ విరచితం బయిన సింహాసనద్వాత్రింశిక యనుకావ్యంబునందు బేతాళహరణంబును, బద్మావతియితిహాసంబును, విక్రమార్కుని యష్టప్రసిద్ధిసంసిద్ధియుఁ దన్మహాసామర్థ్యంబును, బొమ్మలశాపాగమనమోక్షప్రకారంబును దదీయ నిజస్వరూపప్రాప్తియు నన్నది సర్వంబును ద్వాదశాశ్వాసము.

---

* నాకోరినకోలఁదినియ్యా, ‡ అనుచుఁబ్రార్థనచేసెఁ గావున నరేంద్రానందసంధానమై §ద్రిభువనవ్యాపారపారీణునిన్.